# నన్నయ సూక్తిసుధ

ఆదికవి నన్నయ సూక్తి సుధానిత్యానికి దర్పణంపట్టే
భారతంలోని కొన్ని ఎన్నికైన పద్యాలకు
సరళమైన వ్యాఖ్యానం

*వ్యాఖ్యాత:*
అయలసోమయాజుల నాగేశ్వరరావు

*ప్రచురణ*



(ర. సంఖ్య 1/64)
యువభారతి
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాద్ - 500 001

NANNAYA SUKTHISUDHA
*A commentary by*
Ayalasomayajula Nageshwara Rao



ప్రచురణ సంఖ్య : **204**

ప్రథమ ముద్రణ : **29 అక్టోబరు 2023**

ముద్రణ సహకారం : 'పుస్తకశిల్పి' **తాళ్లపల్లి మురళీధర గౌడు**

ముఖచిత్ర రూపకల్పన : **నవ్య ప్రింటర్స్**
మోతీనగర్, హైదరాబాద్

డి.టి.పి. : **బాలసాయి**
సనత్‌నగర్, హైదరాబాద్

లే అవుట్ : **మను గ్రాఫిక్స్**
చిక్కడపల్లి, హైదరాబాద్

ముద్రణ : **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**
విద్యానగర్, హైదరాబాద్-500 044

ప్రతులకు : **యువభారతి**
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001.
చరవాణి : 98499 09896
93913 73684

వెల : **రూ. 80/-**

డా॥ రేవూరు అనంత పద్మనాభరావు
విశ్రాంత అదనపు డైరక్టర్ జనరల్
దూరదర్శన్ (ఢిల్లీ)
హైదరాబాద్
98665 86805



# నన్నయ సూక్తిసుధా సు'వర్ణ'కలశం

ఆదికవి నన్నయ ఆంధ్రుల కారాధ్యుడు. సంస్కృత సాహిత్యాలలో వాల్మీకి మహర్షి ఆద్యుడైనట్లే నన్నయభట్టు తెలుగు సాహిత్యానికి నూత్నధోరణిని చూపి పుణ్యం కట్టుకొన్నాడు. నన్నయ సహస్రాబ్ది ఉత్సవాలను యువభారతి ఘనంగా జరిపి కవి ఋణం తీర్చుకొంది. దశాబ్దాలుగా యువభారతి సారథులలో అగ్రశ్రేణిలో నిలిచిన మిత్రులు అయలసోమయాజుల నాగేశ్వరరావు కార్యదక్షులు, కవితా రససింధువులు. యువతను చైతన్యవంతం చేయడానికి సహస్ర 'ఫణీంద్రు'లై తెలుగు రథాన్ని యువభారతి ముందుకు నడుస్తోంది. తెలుగు ప్రాచుర్యం తగ్గుముఖం పట్టిన నేటి క్షీణదశలో నన్నయ పద్యాలలో ఆణిముత్యాలను 50కి పైగా సాహితీ సముద్ర మథనం చేసి ఏర్చికూర్చి తీర్చి అమర్చారు అయలసోమయాజులవారు.

**కథాసంవిధానం:** కేవలం పద్యాలను ఎంచుకోవడంలో నైపుణ్యం చూపడమేగాక సంబంధిత పూర్వగాథను తవ్విపోసి ఒక రెఫరెన్సు గ్రంథంగా, కరదీపికగా మలచారు. ఉదంకోపాఖ్యానము, గరుడుని వృత్తాంతము, పరీక్షిత్ శాపము, కచునిగాథ, యయాతి వార్ధక్యం, శాకుంతలం, వసిష్ఠ విశ్వామిత్ర సంవాదం, అర్జునుని తీర్థయాత్ర, శిశు పాల వధ, ద్యూత వ్యసనము, ద్రౌపది హుందాతనం, ఇంద్రసురభి సంవాదం– నలదమయంతుల గాథ – వంటి సాభిప్రాయ గాథావివరణలు కథపై ఆసక్తిని పెంచి మూలాన్ని చదువాలనే తృష్ణను పెంచుతాయి.

నన్నయ కవిత్వం ఆపాతమధురం. బహువారపఠనాధురీణులైన

అయలసోమయాజుల నాగేశ్వరరావు ఋషిఋణం తీర్చుకొన్నారు. ఈ తరహాలో చిరుపొత్తం వినూత్నము. అనేకానేక సందర్భాలు, ఉపాఖ్యానాలలో నుంచి ఏరిన ఆణిముత్యాలవి. కంఠస్థం చేయదగిన పద్యసుమాలు! గ్రంథస్థం చేసిన కృషి హృద్యం.

**వార్తాప్రాధాన్యం:** సభాపర్వంలోని నారదధర్మజ సంవాదంలోని వార్తాప్రసక్తి ప్రముఖ దినపత్రికలు పతాక శీర్షికలుగా మలచుకొన్నాయి. "వార్తయందె జగము వర్తిల్లుచున్నవి" అనే ఆటవెలదిని ప్రముఖ సంపాదకులు నార్ల వేంకటేశ్వరరావు ప్రచారంలోకి తెచ్చారు. ఆ పద్యం ఇందులో మణిపూసలా సరస్వర కంఠాభరణంలో అమిరింది. అలానే 'సత్యమప్రియం నబ్రూయాత్' అనే సూక్తిని వివరించడం ముదావహం.

**ఆంగ్ల భాషావైదుష్యం:** నాగేశ్వరరావుగారికి ఆంగ్ల సాహిత్యంపై పట్టు వుందనడానికి నిదర్శనం జూలియస్ సీజర్ నాటకంలోని సూక్తిని నన్నయ సూక్తితో జోడించడం.

"CEASER'S wife shall not only be chaste, but shall be above conspicio అనే సామాన్యంలో వుండే Ethical values సందర్భంలో వాడుకలో వున్న నీతిని అర్జున తీర్థయాత్ర సందర్భంలో ప్రస్తావించడం మామూలు విషయంకాదు. సంస్కృతాంధ్రాంగ్ల భాషా ప్రావీణ్యము, సందర్భోచిత ప్రస్తావన చేయగల ధీమంతులకే అది సాధ్యం. గంభీరంగా, హుందాగా ప్రవర్తించే నాగేశ్వరరావు సాహితీ లోకానికి సుపరిచితులు.

**నానారుచిరార్థ సూక్తినిధి:** ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు నన్నయ కవితా లక్షణాలను ఉటంకించే సందర్భంలో తరచు ప్రస్తావించే పద్యమిది:

*"సారమతిన్ కవీంద్రులు ప్రసన్న కథా కవితార్థయుక్తిలో*
*నారసి మేలునాన్ ఇతరు లక్షరరమ్యత నాదరింప నా*
*నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెలుంగునన్ మహా*
*భారత సంహిత రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్"*

మూడు ప్రధానగుణములు – ప్రసన్న కథాకవితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థసూక్తి నిధిత్వము – నన్నయ కవితా లక్షణాలు. గతంలో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ప్రసన్నకథా కవితార్థయుక్తిపై గ్రంథం ప్రకటించారు. నా ఎరుకలో సూక్తినిధిత్వంపై ఇంతవరకు సాధికారిక గ్రంథం వెలువడలేదు. ఆ ప్రయత్నాన్ని

తన వరివస్యతతో సుసంపన్నం చేసిన శ్రీ నాగేశ్వరరావు అభినందనార్హులు.

నైతిక విలువలు కనుమరుగవుతున్న ఈ తరుణంలో ప్రామాణికమైన ఇటువంటి గ్రంథం యువభారతి వెలువరించడం ముదావహం. గతంలో సినారె చేత పోతన భాగవతంలోని మన్నికైన కొన్ని పద్యాలకు మధురమైన వ్యాఖ్యానం రాయించి 'మందారమకరందాలు' పేరిట యువభారతి ప్రచురించింది. అదేస్థాయిలో నన్నయ సూక్తిసుధను తెలుగు పాఠకలోకానికందిస్తున్న యువభారతికి అంజలి ఘటిస్తున్నాను.

ప్రాచీనసాహిత్యంపైన విశ్వవిద్యాలయ పాఠ్యప్రణాళికలలో అలసత్వం ద్యోతకమవుతున్న ఈరోజుల్లో ఆదికవికి సు'వర్ణ' కలశాన్ని సభక్తికంగా సమర్పిస్తున్న యువభారతికి నమోవాకాలు. జయతు.



వ్యక్తిగత ఇష్టాయిష్టాలకు అతీతంగా నిష్పక్షపాతంగా వ్యవహరించడమే
సత్యాన్వేషణకు, ధర్మాచరణకు దోహదం చేస్తుంది.



సత్యమే తల్లి. జ్ఞానమే తండ్రి. ధర్మమే సోదరుడు. దయయే స్నేహితుడు.
శాంతియే భార్య. ఓర్పే పుత్రుడు. ఈ ఆరుగురే మనిషికి నిజమైన బంధువులు.



సత్యమును మించిన రక్షకులు లోకమున లేనేలేరు.



సత్యమే శాశ్వతమయిన మానవ ధర్మం. జీవితంలో సత్యాన్ని ప్రకటించగలిగే
శక్తిని, ధైర్యాన్ని, నిర్భీతిని మానవుడు పొందగలగాలి.



# నానారుచిరార్థ సూక్తినిధిత్వం

"పద్య కళాప్రవీణ", "కవి దిగ్గజ"
డా. ఆచార్య ఫణీంద్ర
అధ్యక్షులు
"యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ

*సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తి లో*
*నారసి మేలునా, నితరు లక్షర రమ్యత నాదరింప నా*
*నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా*
*భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్!*

**ఆం**ధ్ర మహాభారతం అవతారికలోని పై పద్యంలో నన్నయ భట్టారకునిచే ప్రతిపాదించబడిన కావ్య లక్షణాలు నాలుగు. అవి – ప్రసన్న కథా కలితార్థ యుక్తి, అక్షర రమ్యత, నానా రుచిరార్థ సూక్తి నిధిత్వం మరియు జగద్ధితం. మీ చేతిలో ఉన్న ఈ "యువభారతి" సంస్థ నూతన ప్రచురణ – నన్నయ భట్టుచే విరచితమైన కొన్ని మన్నికైన పద్యాలలోని "నానా రుచిరార్థ సూక్తి నిధిత్వ" లక్షణాన్ని వివరించడానికి చేసిన ఒక చక్కని ప్రయత్నం.

ఈ "నన్నయ సూక్తి సుధ" గ్రంథకర్త, వ్యాఖ్యాత – సుప్రసిద్ధ రచయిత శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు గారు. నాగేశ్వరరావు గారు అరవదేళ్ళ అకుంఠిత సాహితీ సేవను పూర్తి చేసుకొని ముందుకు సాగుతున్న "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ యొక్క వరిష్ఠ సభ్యులు. ఆయన ప్రస్తుతం ఉపాధ్యక్షులుగానే కాకుండా, సంస్థ వజ్రోత్సవ కార్యక్రమాల సమన్వయకర్తగా వ్యవహరిస్తున్నారు.

సమాజంలో సౌమనస్యాన్ని, సామరస్యాన్ని పెంపొందించటానికి సాహిత్యానికి మించిన సాధనం లేదనే సదాశయంతో 1963 సంవత్సరం విజయదశమి పర్వదినం

నాడు ఆవిర్భవించింది "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ. కడచిన అరువదేళ్ళలో "యువభారతి" ఎందరో లబ్ధప్రతిష్ఠులైన సాహితీమూర్తులతో ప్రసంగ కార్యక్రమాలను నిర్వహిస్తూ, 200 లకు పైగా విలువైన సాహిత్య గ్రంథాలను ప్రచురించి సాహిత్య లోకానికి సమర్పించిన విషయం తెలుగు నాట అందరికీ విదితమే! ఇక, ఈ షష్టిపూర్తి (2023) సంవత్సరంలో "యువభారతి" ఎంతో వైభవంగా నిర్వహించిన "మహాభారతోపన్యాస లహరి", "శ్రీమద్రామాయణం – మానవీయ సంబంధాలు" మరియు ఇతర వజ్రోత్సవ సంవత్సర కార్యక్రమాలలో సమన్వయకర్తగా నాగేశ్వరరావు గారు చూపిన కార్యదక్షత బహుధా ప్రశంసాపాత్రం.

ఇక ప్రస్తుత గ్రంథాన్ని పరిశీలిద్దాం. ఈ గ్రంథంలో నాగేశ్వరరావు గారు మొత్తంగా 53 పద్యాలకు సరళ సరణిలో వ్యాఖ్యానాన్ని అందించారు. ఈ వ్యాఖ్యానాన్ని ఆయన తెలుగు భారతంలోని తొలి సంస్కృత శ్లోకంతో శ్రీకారం చుట్టి, అరణ్య పర్వంలోని నన్నయ రచించిన చివరి పద్యంలోని శరత్కాల వర్ణనతో ముగించారు. ఆ రెంటి నడుమ రచయిత 51 నీతి పద్యాలను ఎంచుకొని చేర్చి, అందులోని ప్రతి పద్యానికి సులభ గ్రాహ్య తాత్పర్యాన్ని, అవసరమైన చోట భారత కథాకథనంలో ఆ పద్య సందర్భ వివరణతోబాటు కొన్ని చోట్ల విశేష వ్యాఖ్యానాన్ని కూడ సమకూర్చి గ్రంథానికి సమగ్రతను సమకూర్చారు.

"అలిగిన నలుగక .." అన్న పద్యంలోని సంయమన శీల మహత్వం, "నుతజల పూరితంబులగు .." అన్న పద్యంలోని సత్య వాక్య గరిమ, "గురులలోన పరమ గురువు తల్లియ .." అన్న పద్యంలోని మాతృవాక్య పాలన ప్రాధాన్యం, "వార్తయంద జగము .." అన్న పద్యంలోని వార్తా నిర్వహణా ప్రాశస్త్యం – ఇట్లా ... ఇందులోని అనేక సూక్తులు ఈనాటి యువతలో ధర్మాధర్మ విచక్షణను పెంచి, సత్ప్రవర్తనతో తీర్చిదిద్దేందుకు మార్గదర్శనం చేస్తాయని ఆశిస్తూ, ఈ గ్రంథ రచయిత శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు గారిని మనసారా అభినందిస్తున్నాను.





# 'నీతిని, హితాన్ని బోధించే "నన్నయ్య సూక్తిసుధ"

డా॥ బ్రాహ్మణపల్లి జయరాములు
ప్రధాన సంపాదకులు
'యువభారతి' ప్రచురణలు

శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు గారు సాహిత్య మాధ్యమంగా సమాజ సేవచేస్తున్నారు. "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థలో నిలకడగా దశాబ్దాల తరబడి సాహిత్య సరస్వతిని ఆరాధిస్తున్నారు. భారత, భాగవత, రామాయణాలు, ఉద్గ్రంథాలు. ఈనాటి సమాజంలో మానవీయ మూల్యాలు లుప్తమైపోతున్న విషయాన్ని గమనించి, తనవంతుగా సమాజానికి మార్గదర్శనం చేయాలనే సంకల్పంతో నన్నయ భారత భాగంలోని 'సుధ' లాంటి కొన్ని 'సూక్తులు' గల పద్యాలను ఎంపిక చేసి, వాటిలోని తాత్పర్యాన్ని నేటి సమాజికులకు అందించాలనే తపనతో వారు "నన్నయ సూక్తి సుధ" అనే పేరుతో నన్నయ పద్య సంకలనాన్ని వెలువరిస్తున్నారు. 53 పద్యాలతో (5+3=8) అష్టదిక్కులకు ఈ పద్యభావాన్ని వాటిలోని అమృతంలాంటి మంచి మాటలను (సూక్తులను) వ్యాపింప చేయాలనే తపనతో ఈ గ్రంథం వెలువరిస్తున్నారు.

ఈ గ్రంథంలో సమాజానికి, సామాజికులకు హితం బోధించే చక్కని అంశాలు గల పద్యాలను నన్నయ్యభారత భాగంలోంచి ఏరి కూర్చి తాత్పర్య సహితంగా అందించారు. నీతిశాస్త్రం, ధర్మశాస్త్రం బోధించే మానవాళికి ఉపయుక్తమైన, ఆచరించి బాగుపడాల్సిన అంశాలే పొందుపరిచారు.

పరనింద ఆత్మస్తుతి పనికిరాదు. కోపం పనికిరాదు. దాన్ని నిగ్రహించు కోవాలన్నారు. నాడైనా, నేడైనా సమాజానికి మానవులకు క్షమ, అప్రమత్తత, ధార్మికపాలన అవసరం. ఈనాడు మన సమాజంలో ఎక్కడ చూసినా మదిరాపాన మత్తులే కనిపిస్తున్నారు. దానివల్ల కలిగే నష్టాన్ని వివరించిన పద్యాలిచ్చారు. మానవులు ధర్మజ్ఞులై ఉండాలని, అధర్మం పనికిరాదన్నారు. అలాగే జీవితంలో నటన (నటించడం) వద్దని, నిజాయితీగా జీవించాలన్నారు.

"సత్యంవద" అనే ఉపనిషద్వాక్యాన్ని బలపరిచే పద్యాలను పొందుపరిచారు. మానవ సంబంధాలు మసకబారుతున్న ఈ తరుణంలో పితాపుత్ర సంబంధం ఎలా ఉండాలో తెలిపే పద్యం నేటి సమాజానికి ఉపయుక్తంగా ఉంది. హింస ఎక్కడ జరుగుతున్నా చూస్తూ ఊర్కోరాదని, దాన్ని ఆపాలని హితవు చెప్పారు నన్నయ. ఆ పద్యమూ దీనిలో ఉంది. 'మాతృదేవోభవ' అనే మాటకు వ్యాఖ్యానరూపమై తల్లి గొప్పదనం వివరించే పద్యాన్ని దీనిలో పొందు పరిచారు. మానవులకు కీర్తి కాంక్ష ఉండాలనీ, ధన వ్యామోహం పనికిరాదనే పద్యాలున్నాయి. శరణాగత రక్షణ రాజ ధర్మమని, అవి ప్రతి మనిషి పాటించడం శ్రేయస్కరం అన్నారు. ప్రయత్నం చేయకుండా ఏదీ సాధించలేమని. కాబట్టి మానవులు ప్రయత్నపరులై ఉండాలన్నారు.

ఇంకా, ఉత్తమగుణాలు అలవరచుకోవాలని వాక్పారుష్యం పనికిరాదని, మంచి వారితోనే సావాసం చేయాలని, బలవంతం పనికిరాదని, జూదమాడరాదని, నిగ్రహం అలవరచుకోవాలని. ఇలా ఉత్తమ లక్షణాలను అలవరుచుకొని ఉత్తమ మానవుడుగా, మనిషి రూపొందాలని, సమాజం ఉన్నత సమాజంగా వెలుగొంది, శాంతి సౌఖ్యాలతో విలసిల్లాలనే ఆకాంక్షతో శ్రీరావుగారు ఈ గ్రంథాన్ని (నన్నయ పద్య సంకలనాన్ని) సమాజానికి అందిస్తున్నారు. ఆయన పొందుపరచిన పద్యాలు కొన్ని ఉదాహరిస్తాను.

1. *తగునిది తగదని యెదలో*
   *వగవక, సాధులకు బేదవారల కెగ్గుల్*
   *మొగి జేయు దుర్వినీతుల*
   *కగు ననిమిత్తాగమంబులయిన భయంబుల్* (ఆది. ప్రథ – 85)

2. *అలిగిన నలుగక యెగ్గులు*
   *పలికిన మఱి విననియట్ల ప్రతివచనంబుల్*
   *పలుకక, బన్నము వడియెడ*
   *దల పక యున్నతడె చూవె ధర్మజ్ఞు డిలన్* (ఆది. 3–14)

3. *తనయుందు తల్లిదండ్రులు*
   *పనిచినపని సేయ డేని, పలుకెదలో జే*
   *కొన డేని, వాడు తనయుం*
   *డున బడునే? పితృధనమున కర్హుండగునే?* (ఆది. 3–199)

4. అర్థమ యనర్థ మూలం
బర్థమ మాయా విమోహనావహము, నరుం
డుర్థార్జన దు:ఖమున, న
పార్థీకృతజన్ము డగుట పరమార్థమిలన్ (అరణ్య 1-28)

ఇలా ప్రతి పద్యాన్నీ ఉదహరించ వచ్చును. పాఠకులు, సామాజికులు ఇలా ప్రతి గ్రంథాన్ని చదివి, పిల్లలకు చెప్పి వారి 'వ్యక్తిత్వ వికాసానికి' తోడ్పడాలి. ఇంత మంచి గ్రంథాన్ని వెలువరిస్తున్న శ్రీ ఎ. నాగేశ్వరరావు గారిని మనసా, వాచా అభినందిస్తున్నాను.



నిత్య సత్యమైన కర్మలనాచరించినప్పుడే నిత్యసత్యమైన శాంతి లభిస్తుంది.



వేలాది వ్యర్థములైన మాటలకన్న, విన్నంతనే శాంతిని, కాంతిని ప్రసాదించే మాట ఒక్కటి చాలు.



శాంతము లేక సౌఖ్యము లేదు.



శాంతంగా ఉన్నవారు ప్రతి వారినీ అదుపు చేయగలుగుతారు.



శాంతి సహనాలకు చేరువవుదాం - అసూయ, ద్వేషాలకు దూరమవుదాం.



విశ్రాంతి దేహానికి మంచిది. శాంతి మనసుకు మంచిది.

# నా మాట

ఆదికవి నన్నయగారు నా అభిమాన కవులలో ప్రథములు. ఆయన మీద అంత గౌరవం ఉండటానికి కారణం ఆయన ఆదికవి అవడమే. వ్యాస వాల్మీకి కాళిదాసుల సరసన చేర్చి పూజించదగిన మహనీయుడు.

అక్కడక్కడ శాసనాలలో కనబడే సీస పద్యాలు, ఆటవెలదులు మినహా తెలుగులో సాహిత్యం అంటూ ప్రత్యేకంగా లేని రోజులవి. అటువంటి సమయంలో తనకు కావలసిన వ్యాకరణాన్ని తానే సమకూర్చుకొని, మూల వ్యాస భారతాన్ని ఆసాంతం చదివి, దానిని తెలుగులో ఒక మహా కావ్యంగా మలచటానికి తనదైన ప్రణాళికను వేసుకొని, తనబాటను తాను నిర్మించుకుంటూ, తాను ప్రయాణించాడు. ఆ తరువాత వచ్చిన వందలాది కవులకి ఆ బాటే పూలబాటైంది. అందుకే నన్నయ తెలుగు కవులందరికీ ప్రాతః స్మరణీయుడైనాడు. ఆయన వేసిన బాటలోనే ఆ తరువాతి తెలుగు కవులందరూ అనాయాసంగా నడచి సునాయాసంగా తమ కావ్యాలను వ్రాయగలిగారు. అందుకనే ఆయన ఆదికవి అయినాడు.

ఉ॥ *సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కవి(లి)తార్థయుక్తిలో*
*నారసి మేలునా, నితరు లక్షర రమ్యత నాదరింప, నా*
*నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా*
*భారత సంహితారచనబంధురు డయ్యె జగద్ధితంబుగన్*
(ఆది 1-26)

ఇందులో నన్నయ గారు తన కవిత్వానికి ఉన్న మూడు ప్రధాన లక్షణాలను వివరించారు.

1. ప్రసన్న కథా కవితార్థయుక్తి.
2. అక్షర రమ్యత
3. నానారుచిరార్థ సూక్తి నిధిత్వం

మా యింట్లో వావిళ్ళ వారి మహాభారతం సెట్ ఉండేది. అందులో ప్రతిపదార్థం, తాత్పర్యం లేకపోయినా అలాగే అర్థమయినంత మేర ఒకసారి చదివాను. ఆ తరువాత

తిరుమల తిరుపతి దేవస్థానం వారి "ఆంధ్ర మహాభారతం" వచ్చాక మొత్తం సెట్ తీసుకుని మరోసారి చదివాను. ప్రతిపదార్థం, తాత్పర్యం, విశేషాలు ఉండటంతో కాస్త అర్థమయింది.

ఈ మధ్య కాలంలో ఏదైనా పుస్తకం చదువుతున్నప్పుడు, అందులో ఉన్న మంచి సూక్తులను ఒక డైరీలో రాసుకోవడం అలవాటు చేసుకున్నాను.

*క. మతి దలపగ సంసారం*
*బతిచంచల మెండమావులట్టుల సంప*
*త్ప్రతతు లతిక్షణికంబులు*
*గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్*

అన్న పద్యం చదివి నా డైరీలో నోట్ చేసుకున్నాక నాకు ఎందుకో నన్నయగారి రెండున్నర పర్వాలలోని పద్యాలలో నిక్షిప్తమైన "నానా రుచిరార్థ సూక్తి నిధిత్వం"ని ఒక చోట చేర్చి ఒక సంకలనంగా చేస్తే బాగుండుననిపించింది. అందుకని మళ్ళీ ఆ రెండున్నర పర్వాలనూ మరోసారి చదివి వందకుపైగా సూక్తులున్న పద్యాలను సేకరించాను. గ్రంథవిస్తరణ భీతిచేత అందులో నుండి ముఖ్యమైన ఒక 53 పద్యాలను ఎన్నుకుని ఈ సంకలనం పొందుపరచడమైంది. అలాగే నన్నయ్యగారి ప్రప్రథమ మంగళ శ్లోకం "శ్రీవాణీ గిరిజాశ్చిరా యుదధతో.. పురుషోత్తమామ్బుజభవ శ్రీ కన్థరా(శ్రేయసే" అనే శ్లోకాన్ని ఆదిలోనూ, "శారదరాత్రులుజ్జ్వల లలసత్తరతారకహార పంక్తులం... కర్పూర పరాగ పాండు రుచిపూరము లంబర పూరితంబులై" అన్న నన్నయభట్టు గారి శరత్కాల వర్ణన పద్యంతో ముగించాను. అదే నన్నయగారి చివరి పద్యం.

ఇది ఆంధ్రమహాభారతానికి సహస్రాబ్ది సంవత్సరం. ఆ సందర్భంగా చంద్రునికో నూలుపోగులా నాయీ చిన్ని పుస్తకాన్ని నన్నయగారికి పూజా పుష్పంగా సమర్పిస్తున్నాను. ఇందులో దోషాలేమయినా ఉంటే విజ్ఞులు మన్నింతురు గాక.

ఈ పుస్తకాన్ని 'యువభారతి' పక్షాన ప్రచురించటానికి దయతో అంగీకరించిన సంస్థ అధ్యక్షులు డా॥ ఆచార్య ఫణీంద్రగారికి, వ్యవస్థాపక సమావేశకర్త ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

అడిగినదే తడవుగా పుస్తకాన్ని ఆసాంతం చదివి తన అమూల్యమైన 'ముందుమాట'ను అందించిన మిత్రులు, సాహితీవేత్తలు, దూరదర్శన్ విశ్రాంత అదనపు డైరెక్టర్ జనరల్ డా॥ రేవూరు అనంత పద్మనాభరావు గారికి నా అభివాదములు.

ఈ పుస్తకాన్ని తప్పులు సవరించి, అందంగా ముద్రించి అందించిన నా ప్రియమిత్రుడు, మా యువభారతీయుడు 'పుస్తక శిల్పి' శ్రీ తాళ్ళపల్లి మురళీధర్ గౌడ్‌కి నా ధన్యవాదాలు.

ఎన్నిక చేసిన పద్యాలను స్కాన్ చేసి అందించిన మామేనల్లుడు శ్రీ ఆర్యసోమయాజుల సుధీర్‌కి నా శుభాశీస్సులు.

ఈ పుస్తకాన్ని ఎంతో శ్రమించి డి.టి.పి. చేసి అందించిన శ్రీ మల్యాల హరి గారికి నా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని లే అవుట్ చేసిన మను గ్రాఫిక్స్ అధినేత కుదుపూడి భాస్కర్‌రావు గారికి నా ధన్యవాదాలు.

ఈ పుస్తక ముఖ చిత్రానికి రాజమండ్రిలోని నన్నయ విగ్రహం ఫోటోను అందించి సహకరించిన మిత్రులు శ్రీ యఙ్ఞాప్రగడ రామకృష్ణగారికి, ముఖచిత్రాన్ని ముచ్చటగా తీర్చిదిద్దిన నవ్య ప్రింటర్స్, మోతీనగర్ వారికి నా ధన్యవాదాలు.

పుస్తకాన్ని అందంగా ముద్రించిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, విద్యానగర్, హైదరాబాద్ వారికి నా కృతజ్ఞతలు.

నా ఈ ప్రయత్నాన్ని సహృదయంతో స్వీకరించి నన్ను ఆశీర్వదిస్తారని, తప్పులేమైన దొర్లితే పెద్ద మనసుతో మన్నించి ఆదరిస్తారని తెలుగు సాహితీ లోకానికి విన్నవిస్తూ.. సెలవ్.

భవదీయుడు
అయలసోమయాజుల నాగేశ్వరరావు
ఉపాధ్యక్షుడు
యువభారతి

శ్రీ కృష్ణజన్మాష్టమి
07-09-2023

మనం నిత్యం చేయవలసిన పనులన్నిటినీ ఒక క్రమపద్ధతిలో రూపొందించు కోవాలి. ఈ ప్రక్రియలోనే మన వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటుంది.



మంచిచెడ్డల ఎరుక కలిగి జీవించడం నేర్చుకున్నప్పుడే మన వ్యక్తిత్వం వికసించినట్లుగా భావించాలి.



శీలం, వ్యక్తిత్వం వికసించడానికి విద్యాభ్యాసంలో గురుశిష్యుల మధ్య ఎంతో అన్యోన్యత ఉండాలి.



మీ మంచి వ్యక్తిత్వం మీ కుటుంబంలోని వారిపై, ముఖ్యంగా మీ పిల్లలపై ఎంతో ప్రభావాన్ని చూపిస్తుంది. పిల్లలను సక్రమంగా పెంచి, ప్రయోజకులయ్యేలా తీర్చిదిద్దడమే వారి వ్యక్తిత్వాన్ని రూపొందిస్తుంది. ఇతర సంపదలకన్నా, తీర్చిదిద్దబడిన వ్యక్తిత్వమే అసలు సిసలైన సంపద.



పాత కొత్తల మేలు కలయిక మీ వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తుంది.



మానవ సంబంధాల అభివృద్ధి వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తుంది. ఆత్మీయతతో వ్యవహరించడమే మానవ సంబంధాలకు మూలం.



మాటలలో పరిమితిని, చేతలలో అపరిమిత సామర్థ్యాన్ని చూపించగలగడమే ఉత్తమ వ్యక్తిత్వ లక్షణం.

# నన్నయ సూక్తిసుధ

1. *శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే*
*లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్*
*తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వ స్సురై*
*ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరా శ్శ్రేయసే.*

**ఆదిపర్వము - ప్రథమాశ్వాసము - 1**

**తాత్పర్యము:** మహావిష్ణువు తన భార్య అయిన లక్ష్మీదేవిని తన ఉరము నందును, బ్రహ్మ తన భార్యయైన సరస్వతీ దేవిని తన ముఖమునందును, పరమశివుడు తన భార్య అయిన పార్వతీదేవిని తన అర్ధశరీరముగను ధరిస్తున్నవారై, స్త్రీ పురుష సంయోగము వలన పుట్టిన ఈ లోకాలకు అవిచ్ఛిన్నంగా సుస్థిరత్వాన్ని కలిగిస్తున్నవారు. మూడు వేదాల మూర్తులైన వారు, దేవతలచేత పూజింపబడుతున్న వారు అయిన విష్ణు, బ్రహ్మ, మహేశ్వరులనబడే త్రిమూర్తులు మీకు శ్రేయస్సు కలిగింతురు గాక!

**విశేషము :** ఇది మంగళశ్లోకం. కావ్యాన్ని శ్రీకారంతో ప్రారంభించటం మంగళకరం. అందుకని ఈ ఒరవడినే మిగిలిన కవులంతా పాటించారు. నన్నయ మహాకవి తాను మహాభారతాన్ని తెలుగులో రచిస్తున్నప్పటకీ, ఈ ఆరంభ శ్లోకాన్ని సంస్కృతంలోనే వ్రాశాడు. స్త్రీ పురుష సంయోగోద్భవమైన లోకానికి అవిచ్ఛిన్నంగా, సుస్థిరత్వాన్ని కలిగిస్తున్నారనటం వల్ల, వేద సమ్మతమైన గృహస్థాశ్రమానికి మహాభారతంలో ప్రాధాన్యత ఉంటుందని ఈ శ్లోకం ద్వారా సూచించడం జరిగింది.

**2.** క.		*తగు నిది తగ దని యెదలో*
*వగవక, సాధులకుఁ బేదవారల కెగ్గుల్*
*మొగిఁ జేయు దుర్వినీతుల*
*కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్.*

**ఆదిపర్వము - ప్రథమాశ్వాసము - 85**

**తాత్పర్యము:** యుక్తాయుక్త విచక్షణ లేకుండా బీదవారికి, మంచివారికి కావాలని అపకారం చేసే నీతి రహితులకు అకారణంగానే ఆపదలు సంభవిస్తుంటాయి.

**సందర్భము:** జనమేజయుడు చేసే యజ్ఞ ప్రదేశానికి సారమేయుడనే పేరుగల కుక్కపిల్ల ఆటకోసం వచ్చి తిరుగుతుండగా జనమేజయుని సోదరులు ఆ కుక్కపిల్లను అకారణంగా కొడతారు. అపుడు ఆ కుక్క పిల్ల తల్లి జనమేజయుని వద్దకు వెళ్ళి పై పలుకులు పలికి అదృశ్యమౌతుంది.

నన్నయగారి రుచిరార్థ సూక్తి నిధిత్వానికి ఇది ఒక ఉదాహరణ-

**3.** క.		*కర మిష్టము సేసితి మా*
*కరిసూదన! దీన నీకు నగు సత్ఫలముల్*
*గురుకార్యనిరతు లగు స*
*త్పురుషుల కగు టరుదె? యధధికపుణ్యఫలంబుల్.*

**ఆదిపర్వము - ప్రథమాశ్వాసము - 119**

**తాత్పర్యము:** ఓ ఉదంకా! నీవు మాకు ప్రియాన్ని కలిగించావు. దీని వలన నీకు మంచి ఫలితాలు కలుగుతాయి. గురువుల పనులు చేయడంలో ఆసక్తి ఉన్నవారికి గొప్ప పుణ్యఫలాలు అందడంలో ఆశ్చర్యమేమున్నది?

**సందర్భము:** ఉదంకుడు గురుపత్ని కోరిక మేరకు సౌమ్యుడనే మహారాజు యొక్క దేవేరి కర్ణాభరణాలను దానంగా పుచ్చుకొని, వాటిని దారిలో తక్షకుడుపహరించగా, నాగలోకానికి వెళ్ళి, నాగరాజును ప్రార్థించి, కుండలాలను తెచ్చి గురుపత్ని కిచ్చిన సందర్భంలో వ్రాసిన పద్యం. గురుకార్య నిర్వహణాతత్పరులకు అధిక పుణ్యఫలం లభించడం సామాన్యమైన విషయం అని కవి భావం. ఇది నన్నయగారి సూక్తి సుధానిధిత్వానికి ఒకచక్కని ఉదాహరణ.

**4.** ఉ. *ప్రల్లదుఁడైన యొక్కకులపాంసను చేసినదానఁ దత్కులం*
*బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము। గావునన్ మహీ*
*వల్లభ! తక్షకాధము నెపంబున సర్పము లెల్ల నగ్నిలో*
*ద్రెళ్ళఁ గ సర్పయాగ మతిధీయుత! చేయుము విప్రసమ్మతిన్.*

**ఆదిపర్వము - ప్రథమాశ్వాసము - 125**

**తాత్పర్యము:** దుష్టుడై కులానికి అపకీర్తి తెచ్చే ఒక్కడివలన ఆ కులమంతా నిందింపబడటంలో ఆశ్చర్యం ఏమున్నది? కావున ధీయుతుడవైన ఓ జనమేజయ మహారాజా! ఈ తక్షకుని నెపంతో సర్పాలన్నీ అగ్నిలో పడేలాగ సర్ప యాగమును బ్రాహ్మణుల సమ్మతితో చేయుము.

**సందర్భము:** ఉదంకుడు జనమేజయునికి సర్పయాగం చెయ్యమని ప్రోత్సహిస్తూ తక్షకుడు దుష్టుడు, నీ తండ్రిని చంపి ఆ కులానికంతటికీ అపకీర్తి తెచ్చాడు. అందుచేత నువ్వు సర్పయాగం చేసి తక్షకుడితో సహా సర్పాలన్నింటినీ ఆహుతి చేసే యజ్ఞాన్ని చేయుమని ప్రోత్సహించే సందర్భంలో చెప్పినది. దుష్టుడై, కులానికి అపకీర్తి తెచ్చే ఒక్కడి వలన ఆ కులమంతా నిందింపబడటంతో ఆశ్చర్యం లేదని కవి భావన. చక్కటి సూక్తి కదూ! అంతేకాక ఇది భావి కథా సూచకము కూడా!

**5.** క. *పరనిందయు, నాత్మగుణో*
*త్కరపరి కీర్తనముఁ జేయఁగా నుచితమె స*
*త్పురుషుల? కైనను, నీ క*
*చ్చెరువుగ నా కలతెఱంగుఁ జెప్పెదఁ బ్రీతిన్.*

**ఆదిపర్వము - ద్వితీయా శ్వాసము - 112**

**తాత్పర్యము:** పరనింద, ఆత్మస్తుతి చేసుకోవటం సత్పురుషులకు తగునే! అయినా నీవు ఆశ్చర్యపడే విధంగా నా గురించి సత్యమైన విషయాలను వివరిస్తాను అని గరుత్మంతుడు దేవేంద్రునికి చెబుతాడు.

**సందర్భము:** 'గరుత్మంతుడు' తన తల్లి బానిసత్వాన్ని బాపుటకై ఇంద్రలోకం వెళ్ళి అక్కడ కాపలా ఉన్న భటులతో పోరాడి అమృతకలశాన్ని తీసుకువస్తాడు. అపుడు

ఇంద్రుడు కోపించి తన వజ్రాయుధాన్ని ప్రయోగిస్తాడు. అందుకు బదులుగా గరుత్మంతుడు తన రెక్కలలోని ఒక ఈకను ఇంద్రుని వజ్రాయుధానికి సమర్పిస్తాడు. దానిని చూచిన దేవేంద్రుడు అతని శక్తిని గ్రహించి, అతనితో మిత్రత్వము కోరి, గరుడుని అతని బల పరాక్రమాలను గూర్చి అడుగుతాడు. అప్పుడు గరుడుడు చెప్పిన మాటయిది. ఇందులో నన్నయగారు ఎంత చక్కని సూక్తిని అందించారో చూడండి.

**6.** క.
*క్రోధమఁ తపముం జెఱుచునుఁ*
*గ్రోధమ యణిమాదు లైన గుణములఁ బాపుం*
*గ్రోధమ ధర్మక్రియలకు*
*బాధ యగుం; గ్రోధిగాఁ దపస్వికి జన్నే?*

**ఆదిపర్వము – ద్వితీయాశ్వాసము – 172**

**తాత్పర్యము:** క్రోధము తపమును చెరచును. అణిమాది అష్ట సిద్ధులను నాశనం చేస్తుంది. కోపమే ధర్మ కార్యాలకు బాధను కలిగిస్తుంది. కాబట్టి అటువంటి కోపం తపస్సు చేసుకొనే వారికి ఉండటం తగునా!

**7.** క.
*క్షమ లేని తపసితపమును,*
*బ్రమత్తుసంపదయు, ధర్మబాహ్యప్రభురా*
*జ్యము భిన్నకుంభమున తో*
*యములట్టుల యధ్రువంబు లగు నివి యెల్లన్.*

**ఆదిపర్వము – ద్వితీయాశ్వాసము – 173**

**తాత్పర్యము:** ఓర్పులేని ముని తపస్సు, మత్తులో ఉన్న వాని ధనము, అధర్మ పాలకుని రాజ్యము, చిల్లు కుండలోని నీటివలె అస్థిరాలవుతాయి. తపోధనులకు కోపం పనికిరాదని, అది అన్నింటినీ నాశనం చేస్తుంది అని తెలిపే పై రెండు పద్యాలు నన్నయ గారి సూక్తి సుధానిత్యానికి మచ్చు తునకలు.

**సందర్భము:** పరీక్షిత్తు మహారాజు వేటకై అడవికి వెళ్ళి. తను వేటాడిన మృగాన్ని అనుసరిస్తూ వచ్చి, తపోనిష్ఠలో ఉన్న శమీకుడనే మునిని, “మునిశ్రేష్ఠా! నాచేత

బాణం దెబ్బతిన్న లేడి ఆ బాణంతో కూడా ఇటువైపు వచ్చింది. మీరేమయినా చూశారా? అది ఎక్కడికి పారిపోయిందో, మీకు తెలిస్తే చెప్పండి" అని అడుగుతాడు. అతడు మాట్లాడకుండా మౌనంగా ఉండటం చూసి, కోపించి, అతని చెంత చచ్చిపడివున్న పామును, తన వింటికొనతో ఎత్తి ఆ శమీకుని మెడలో వేసి తిరిగి హస్తినాపురానికి వెళ్ళిపోయాడు. ఆ సంగతి తెలుసుకున్న శమీకుని కుమారుడు 'బృంగి' తన తండ్రి మెడలో పాము యొక్క కళేబరాన్ని వేసిన ఆ మహారాజు ఏడు దినాలలో పాముకాటుతో మరణిస్తాడని శాపం పెడతాడు. అది తెలిసికొన్న శమీకమహర్షి దుఃఖిస్తూ తన కుమారునితో అన్న మాటలు.

**8.** ఆ.

*మొదలి పెక్కు జన్మములఁ బుణ్యకర్మముల్ఁ*
*పరఁగఁ బెక్కుసేసి పడయఁబడిన*
*యట్టి యెఱుక జనుల కాక్షణ మాత్రన*
*చెఱచు మద్యసేవ సేయ నగునె?*

**ఆదిపర్వము - తృతీయాశ్వాసము - 120**

**తాత్పర్యము:** అనేక జన్మలలో చేసిన పుణ్య కార్యాలవలన ఒనగూడిన జ్ఞానం, మద్యం సేవించటం వల్ల క్షణ మాత్రంలో పోగొట్టుకోబడుతుంది. అటువంటి మద్యాన్ని సేవించవచ్చునా? (కూడదు) అని భావం.

**9.** క.

*భూసురు లాదిగఁ గల జను*
*లీసుర సేవించిరేని యిది మొదలుగఁ బా*
*పాసక్తిఁ బతితు లగుదురు*
*చేసితి మర్యాద, దీనిఁ జేకొనుఁడు జనుల్.*

**ఆదిపర్వము - తృతీయాశ్వాసము - 121**

**తాత్పర్యము:** ఇది మొదలుగా బ్రాహ్మణులు, మొదలగు జనులు ఈ మద్యపానం చేస్తే పాపములందు తగులుకొని, దుర్గతిపాలవుతారని కట్టడిచేస్తున్నాను. ప్రజలందరూ దీనిని గ్రహించండి. అని నాటి నుంచి మద్యపానాన్ని చేస్తే పాపములందు తగులుకొని దుర్గతి పాలవుతారని శుక్రాచార్యుడు శపిస్తాడు.

**సందర్భము:** బృహస్పతి కుమారుడైన కచుడు, మృత సంజీవనీ విద్యను నేర్చుకునేందుకై శుక్రాచార్యుని వద్ద శిష్యునిగా చేరతాడు. ఇది కిట్టని రాక్షసులు ఒకసారి కచుని చంపి, కాల్చి మద్యంలో ఆ బూడిదను కలిపి గురువైన శుక్రాచార్యునికిస్తారు. అతడు ఆ మద్యం తాగుతాడు. తరువాత, ఎంతసేపటికీ కచుడు ఇంటికి రాకపోవడంతో శుక్రాచార్యుని కూతురు దేవయాని కచుని యందు మనసుకలదై, తాను కచుడ్ని చూస్తేగాని అన్నం స్వీకరించనని మారాం చేస్తుంది. అప్పుడు శుక్రాచార్యుడు దివ్య దృష్టితో మద్యంలో కలిసిన బూడిద రూపంలో తన కుక్షిలో ఉన్న కచుడిని చూచి మద్యపానం చేసిన హానిని తెలుసుకుని పశ్చాత్తాప పడతాడు.

**విశేషము:** సురాపానం చేయడం వలన కలిగే దుష్ఫలితాలను చెప్పే ఈ నన్నయగారి సూక్తులు లోకుల కందరికీ ఆచరణీయాలు.

**10.** క.

*అనుపమ నియమాన్వితు లై*
*యనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు సే*
*సినవారికంటె నక్రో*
*ధనుఁడ గరం బధికుఁ డంద్రు తత్త్వవిధిజ్ఞుల్.*

**ఆదిపర్వము - తృతీయాశ్వాసము - 146**

**తాత్పర్యము:** అత్యంత నియమనిష్ఠలతో, సాటిలేని దక్షిణలతో, వేలకొద్ది యజ్ఞాలు చేసిన వారికన్న కోపం లేని వాడు అధికుడని తత్త్వజ్ఞాన పరాయణులు చెబుతారు.

**11.** క.

*అలిగిన నలుగక, యెగ్గులు*
*పలికిన మఱి విననియట్ల ప్రతివచనంబుల్*
*వలుకక, బన్నము వడి యెడఁ*
*దలఁపక యున్నతఁడె చూవె ధర్మజ్ఞుఁడిలన్.*

**ఆదిపర్వము - తృతీయాశ్వాసము - 147**

**తాత్పర్యము:** ఇతరులు కోపించినా తాను కోపించకుండా, ఇతరులు నిందలు పలికినా వాటిని వినీ విననట్లు మారు పలుకక, అవమానం పొంది కూడా మనస్సులో తలవకుండా ఉన్నవాడే ఇలపై ధర్మమెరిగిన వాడు.

**సందర్భము:** రాక్షసరాజైన వృషపర్వుని కూతురు శర్మిష్ఠ ఒకసారి దేవయానితో పాటు అనేక మంది కన్యలతో కూడి, ఉద్యానవనానికి వెళ్ళింది. వారంతా ఒక కొలను ఒడ్డున తమ తమ వస్త్రాలను పెట్టి జలకాలాడుతుండగా సుడిగాలి వచ్చి ఆ బట్టలన్నీ కలిసి పోతాయి. తరువాత కొలను నుండి బయటకు వచ్చిన శర్మిష్ఠ తొందరలో దేవయాని చీరను కట్టుకున్నది. కాని దేవయాని శర్మిష్ఠ చీర కట్టుకొనడానికి అంగీకరించదు. అందుకు కోపం వచ్చిన శర్మిష్ఠ దేవయానిని దగ్గరలో ఉన్న పాడుపడిన నూతిలోకి తోసివేస్తుంది. అడవిలో వేటకై వచ్చిన యయాతి మహారాజు ఆమెను రక్షిస్తాడు. కాని దేవయాని కోపంతో తాను ఆ వృషపర్వపురంలో అడుగు పెట్టనని చెబుతుంది. అప్పుడు శుక్రుడు కోపం లేకపోవటం ఎంత గొప్ప గుణమో వివరిస్తూ చెప్పిన పద్యాలివి.

**విశేషము :** నన్నయగారి సూక్తి సుధానిధిత్వానికి ఇది మరొక మంచి ఉదాహరణ. మానవ ధర్మాన్ని చక్కగా నిర్వచించిన నన్నయగారి సూక్తి.

**12.** క.
*కడు ననురక్తియు నేర్పును*
*గడకcయు, గలవారి నుఱక కడవcగ నెగ్గుల్*
*నొడివెడు వివేకశూన్యుల*
*కడ నుండెడు నంతకంటెc గష్టము గలదే.*

**ఆదిపర్వము - తృతీయాశ్వాసము - 149**

**తాత్పర్యము:** అనురాగము, నేర్పు, పూనిక, ఉన్న వారిని లక్ష్య పెట్టకుండా, అనవసరంగా నిందలు వేసే హీనుల వద్ద ఉండడంకంటే నీచత్వం మరొకటి లేదుకదా!

**సందర్భము:** దేవయాని, శర్మిష్ఠ ద్వారా తనకు జరిగిన అవమానాన్ని తండ్రి శుక్రాచార్యుడు తేలికగా తీసుకుని ఆమెకు సర్దిచెప్పే ప్రయత్నం చేస్తాడు. కాని దేవయాని తండ్రి మాటలు వినక, తనను, తన తండ్రిని లక్ష్య పెట్టకుండా అనవసరంగా నిందలు మోపే హీనుల వద్ద ఉండడం కంటే నీచత్వం మరొకటి లేదని తండ్రితో చెప్పిన సందర్భంలో వ్రాసిన పద్యం.

**విశేషము :** ప్రేమ, నేర్పు, పూనిక ఉన్న వారిని లక్ష్యపెట్టకుండా అనవసరంగా

నిందలు వేసే యజమానుల వద్ద పనిచేయటం కంటే నీచత్వం మరొకటి లేదనే నన్నయగారి సూక్తి ఈనాటికీ అన్వయమవుతుంది.

**13.** క. *తనయుండు దల్లిదండ్రులు*
*పనిచినపని సేయఁడేని, పలు కెడలోఁ జే*
*కొన డేని, వాడు తనయుఁ*
*డనబడునే? పితృధనమున కర్హుం డగునే?*

**ఆదిపర్వము – తృతీయాశ్వాసము – 199**

**తాత్పర్యము:** తల్లిదండ్రులు చెప్పిన పనిచేయనివాడు, వారి మాటలను లక్ష్య పెట్టనివాడు, కొడుకు అనబడడు. తండ్రి సొమ్ముకు వారసుడు కాలేడు.

**సందర్భము:** శుక్రాచార్యుని శాపంతో యయాతి ముసలివాడయ్యాడు. కానీ అతనికి విషయవాంఛల యందు తృప్తి తీరక తన తనయులనందరినీ పిలిచి మీలో ఒకడు నా ముసలితనాన్ని గ్రహించి, మీ యౌవనాన్ని నాకు ఇవ్వండి అని అడుగుతాడు. అందుకు మిగిలిన కొడుకు లెవరూ అంగీకరించరు. ఆఖరి కొడుకయిన పూరుడు మాత్రం అందుకు అంగీకరిస్తాడు. అందుకు ఆఖరి కొడుకైన పూరుడికి రాజ్యపట్టాభిషేకం చేస్తాడు. అయితే కొంతమంది పురపెద్దలు, నీ పెద్దకొడుకు, మంచి సామర్థ్యం కలవాడు, భూభారాన్ని వహించే నేర్పుకలవాడూ అయిన యదువుకు రాజ్యం ఇవ్వకుండా చిన్న వాడికి రాజ్య పట్టాభిషేకం చేశావెందుకు అని ప్రశ్నించిన సందర్భంలో రాసిన పద్యమిది.

**విశేషము :** కొడుకులు తలి తండ్రులతో ఎలా మసలుకోవాలో తెలిపే నన్నయగారి ఈ సూక్తి ఈనాటి పిల్లలకు కూడా వర్తిస్తుంది.

**14.** తే.గీ. మదముఁ గామముఁ గ్రోధంబు మత్సరంబు
లోభమును మోహమును నను లోనిసహజ
వైరివర్గంబు నొడిచినవాఁడ యొడుచు
నశ్రమంబున వెలుపలి యహితతతుల.

**ఆదిపర్వము – తృతీయాశ్వాసము – 206**

**తాత్పర్యము:** కామ, క్రోధాది అంతఃశత్రువులను జయించినవాడే, బయట ఉన్న శత్రుసమూహమును సులభముగా జయించగలడు.

**సందర్భము:** యయాతి' పూరువునకు పట్టాభిషేకానంతరం బోధించిన కొన్ని నీతులలో ఇది ఒకటి. అంతః శత్రువులను జయించినవానికి బాహ్య శత్రువులను జయించుట చాలా తేలికైన విషయమని సూక్తి. నిజమే కదా మరి!

**15.** ఆ. సర్వభూతదయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మ వొం డెఱుంగ,
నొరుల నొప్పి కోడ కుపతాప మొనరించు
నదియ కడు నధర్మ మనిరి బుధులు.

**ఆదిపర్వము – తృతీయాశ్వాసము – 219**

**తాత్పర్యము:** ఎల్లజీవుల పట్ల దయగలిగి ఉండటము, సత్యం పలుకటం కంటే శ్రేష్ఠమైన ధర్మ మింకొకటి లేదు. ఇతరులను బాధించుట, సంతాపం కలుగచేయుట మిక్కిలి అధర్మమని పండితులు చెప్పారు.

**సందర్భము:** ఇంద్రుని శాపము వలన స్వర్గలోక భ్రష్టుడై, అతని ఆజ్ఞచేత నక్షత్ర లోకానికి వచ్చిన యయాతిని చూచి, ఆ యయాతి తమకు మాతామహుడవటం చేత, అతని గొప్ప తనం సమస్తలోకాలలో ప్రసిద్ధం అవ్వడం చేత, అష్టకుడు మొదలైన వారు ధర్మా ధర్మములను గూర్చి అడుగగా యయాతి చెప్పిన మాటలివి. ఇంతకు మించిన ధర్మం లోకంలో లేదు కదా!

16. క. *మఱచినఁ దలఁపింపఁగ నగు,*
*నెఱుఁగని నాఁ డెల్లపాట నెఱిగింప నగున్,*
*మఱి యెఱిగి యెఱుగ నొల్లని*
*కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే.*

**ఆదిపర్వము – చతుర్థాశ్వాసము – 72**

**తాత్పర్యము:** ఎవరైనా నిజంగా మరచిపోతే జ్ఞాపకం చేయవచ్చు. అసలు తెలియని వానికి ప్రయత్నించి కొంత తెలియచేయవచ్చును. కాని తెలిసికూడా తెలియనట్లు నటించే మోసగాడికి తెలియచేయటం ఆ బ్రహ్మతరం కూడా కాదు.

**సందర్భము:** శకుంతల తన కుమారుడు భరతుని తీసుకుని దుష్యంతుని వద్దకు వెళ్తుంది. ఆ కుమారుడు దుష్యంత కుమారుడని, తమను స్వీకరించుమని చెబుతుంది. అందుకు దుష్యంతుడు నిరాకరిస్తాడు. అపుడు శకుంతల చింతాక్రాంతయై తనలో తాను అనుకున్న మాటకి రూపు ఈ పద్యం. ఇది మనకు 'తెలిసియు, దెలియని నరుదెల్ప బ్రహ్మదేవుని వశమే' అనే భర్తృహరి సుభాషితాన్ని గుర్తుకు తెస్తుంది. ఇది నన్నయ గారి రుచితార్థ సూక్తికి చక్కని నిదర్శనం.

17. క. *సతియును గుణవతియుఁ బ్రజా*
*వతియు ననువ్రతయు నైన వనిత నవజ్ఞా*
*న్వితదృష్టిఁ జూచు నతి దు*
*ర్మతి కిహముం బరముఁ గలదె మతిఁ బరికింపన్.*

**ఆదిపర్వము – చతుర్థాశ్వాసము – 82**

**తాత్పర్యము:** పతివ్రత, గుణవతి, సంతానవతి, అనుకూలవతి యైన భార్యను తిరస్కార భావంతో చూచే దుష్టునికి ఇహ, పర సుఖాలు ఉంటాయా? (ఉండవని అర్థం)

**సందర్భము:** శకుంతల తన కుమారుడు భరతునినో కలిసి దుష్యంతుని రాజ్యసభకు వెళ్ళి తమను స్వీకరించుమని అడిగినప్పుడు దుష్యంతుడు లోకాపవాదానికి వెరచి కాదంటాడు. ఆ సందర్భంలో శకుంతల పలికిన మాటలివి. ఎంత చక్కటి సూక్తి. ఇది నన్నయగారి సూక్తి సుధానిధిత్వానికి ఒక చక్కని ఉదాహరణ.

**18.** చ. నుతజలపూరితంబు లగు నూతులు నూజిటికంటె సూనృత
*వ్రత! యొక బావి మేలు, మఱి బావులు నూఱిటికంటె నొక్కస*
*త్క్రతువది మేలు, తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు, త*
*త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు సూడఁగన్.*

**ఆదిపర్వము – చతుర్థాశ్వాసము – 94**

**తాత్పర్యము:** సత్యపరాయణుడవైన ఓ రాజా! పరికించగా మంచి నీటితో నిండిన నూరు చేదుడు బావుల కంటే ఒక దిగుడు బావి మేలు. అటువంటి నూరు దిగుడు బావులకంటె ఒక యజ్ఞము గొప్పది. అట్టి నూరు యజ్ఞముల కంటె ఒక కుమారుడు మేలు. అట్టి నూర్గురు కుమారుల కంటె ఒక సత్యవాక్యము మేలు.

**సందర్భము:** దుష్యంతుడు కావాలనే అబద్ధం ఆడుతున్నాడని గ్రహించిన శకుంతల సత్యవాక్కు యొక్క గొప్పతనాన్ని తెలియ చేసే పద్యం ఇది. మహారాజును 'సూనృతవ్రత' అని సంబోధించడంలో మర్మం అబద్ధమాడవద్దని రహస్యంగా హెచ్చరించడమే. సత్యవాక్కు యొక్క గొప్పతనాన్ని తెలియచేసే పద్యం. ఇది ఎంత అందమైన భావమో చూడండి.

**19.** క. *మతిఁదలపఁగ సంసారం ।*
*బతి చంచల మెండమావులట్టుల సంప*
*త్తృతతు లతిక్షణికంబులు, ।*
*గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్.*

**ఆదిపర్వము – పంచమాశ్వాసము – 159**

**తాత్పర్యము:** పరికించి చూస్తే సంసారం ఎండమావి వలె అతి చంచలం. సంపదలు అశాశ్వతాలు. రాబోయే రోజుల కంటే గడచిన రోజులే మంచివి.

**సందర్భము:** పాండు రాజు మరణానంతరం కుంతీదేవి పాండవులను తీసుకుని హస్తినాపురం చేరుతుంది. పాండురాజునకు విదురుడు పితృయజ్ఞ విధానాన్ని పూర్తి చేస్తాడు. తరువాత వ్యాసుడు సత్యవతిని పిలచి రహస్యంగా ఈ విషయాన్ని చెపుతాడు.

వేదవ్యాసుడు తన దివ్య దృష్టితో భవిష్యత్తులో జరగబోయే విషయములను తెలుసుకుని, సత్యవతిని తన కోడండ్లైన అంబిక, అంబాలికలను తీసుకుని వనవాసానికి వెళ్లమని ప్రేరేపించే సందర్భంలో వ్రాయబడిన పద్యం. అతి ప్రసిద్ధాలైన నన్నయ జాతీయాలలో ఇది ఒకటి. ఇది ఏనాటికైనా సత్యమనిపిస్తుంది. ఇది ఒక జాతీయంగా నేటికీ తెలుగు ప్రజల నాల్కలపై నడయాడుతూనే ఉంటుంది.

**20.**ఉ. ఇందుల కిమ్మెయిన్ మనుజు లెన్నఁడు వత్తురె? వత్తురేని యా
నందముఁ బొంది నిర్భయమునన్ శయనింతురె? యిట్లు వంటయిల్
కుందెలు సొచ్చె, వేగ చని కోమలి ! వారలఁ జంపి తెచ్చి నా
కొందగ వండి పెట్టుము రసోత్కట మానవ మాంస ఖండముల్.

**ఆదిపర్వము - షష్ఠాశ్వాసము - 187**

**తాత్పర్యము:** ఇక్కడికి ఈ విధంగా మానవులెవరైనా వస్తారా? వచ్చినా ఇలా ఆనందంగా, నిశ్చింతగా నిద్రపోతారా? వంటింట్లోకి కుందేలు వచ్చింది. వారిని చంపి, వారి రుచికరమైన మాంసపు ముక్కలను నాకు చక్కగా వండిపెట్టు.

**సందర్భము:** లాక్షాగృహ దహనానంతరం భీమసేనుడు తన తల్లిని, అన్నదమ్ములను సొరంగమార్గం ద్వారా తన భుజాలపై మోసుకువచ్చి ఒక చెట్టుకింద పడుకోబెడతాడు. అది చూసిన హిడింబుడనే రాక్షసుడు తన సోదరి హిడింబితో పలికిన మాటలివి. ఇప్పటికీ తనకు కావాలనుకున్నది తన ప్రయత్నం లేకుండా లభిస్తే “వంటింటి కుందేలు మాదిరిగా దొరికింది” అని ఈ జాతీయాన్ని వాడతారు.

మానవ సంబంధాల అభివృద్ధి వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తుంది.
ఆత్మీయతతో వ్యవహరించడమే మానవ సంబంధాలకు మూలం.



మాటలలో పరిమితిని, చేతలలో అపరిమిత సామర్థ్యాన్ని చూపించగలగడమే
ఉత్తమ వ్యక్తిత్వ లక్షణం.

**21.** తే. వధకు నర్హుఁడై వచ్చినవానిఁ జంపి
తదియు ధర్మువ, యిది చాల నబల, దీని
కలుగ జన, దాత్మరక్షకు నగ్గలంబు
ధర్మరక్షయ యుత్తమధార్మికులకు.

**ఆదిపర్వము –షష్ఠాశ్వాసము – 220**

**తాత్పర్యము:** చంపదగిన వాడిని చంపావు. ఈ హిడింబి అబల. దీని మీద కోపగించకూడదు. ధర్మాత్ములకు ఆత్మరక్షణ కంటే ధర్మ రక్షణమే మేలైనది.

**సందర్భము:** హిడింబాసురుని భీమసేనుడు చంపిన తీరు చూసి, భయపడి హిడింబి వణుకుతూ, భీముని వెంట వస్తుండగా, "నీవు రాక్షస కాంతవు. రాక్షసులు మాయ చేస్తారు. అందుచేత నీవు మాతో రావద్దు. నీవు నీ అన్న చచ్చినట్లే చావు" అని అనగా విని ధర్మరాజు భీమునితో పలికిన పలుకులివి. చంపదగిన వాడిని చంపటం, చంపకూడని వారిని రక్షించటం ఉత్తమమైన క్షత్రియ ధర్మాలనీ, క్షత్రియులకు ఆత్మరక్షణ కంటే, ధర్మరక్షణే ఉత్తమమైనదని బోధిస్తాడు. ఇది నన్నయ గారి రుచిరార్థ సూక్తులలో ఒకటి.

**22.** ఆ. పరులవలన బాధ పొరయకుండఁగ సాధు
జనుల ధనము గాచు జనవిభుండు
కరుణ తప్పి తాన హరియించువాఁ డగు
నేని సాధులోక మేమి సేయు?

**ఆదిపర్వము – సప్తమాశ్వాసము – 104**

**తాత్పర్యము:** ఇతరుల వలన బాధ పొందకుండా సాధారణ ప్రజల్ని కాపాడ వలసిన రాజే హరించే వాడైతే ఇక సామాన్యుల గతి ఏమిటి? సామాన్యులు ఏమి చేయగలుగుతారు?

**సందర్భము:** ఒకసారి విశ్వామిత్ర మహారాజు అపారమైన సైన్యం వెంట రాగా, వేటకు వెళ్ళి, భయంకరమైన అరణ్యంలో తిరిగి, అలసి, విశ్రాంతి కొరకు వసిష్ఠుని ఆశ్రమానికి వచ్చాడు. వసిష్ఠుడు, విశ్వామిత్రుని ఆదరించి, అతనికి, అతని సేవకులకూ

ఇష్టమైన ఆహార పదార్థాలు సమృద్ధిగా అందచేయమని, తన వద్దనున్న 'నందిని' అనే కామధేనువును కోరతాడు. 'నందిని' అతని ఆజ్ఞప్రకారం అందరికీ మృష్టాన్న భోజనాలను క్షణంలో ఏర్పాటు చేసింది. అది చూచిన విశ్వామిత్రుడు, ఆ 'నందిని'ని తనకివ్వమని, అందుకు బదులుగా ఒక లక్ష పాడి ఆవులనిస్తానంటాడు. కాని దానికి వసిష్ఠుడు నిరాకరించగా విశ్వామిత్రుడు ఆ 'నందిని' ని బలవంతంగా తీసుకుపోతాడు. ఆ సందర్భంలో వ్రాయబడిన ఈ పద్యం 'కంచే చేను మేస్తే' అనే సామెతను గుర్తుకు తెస్తుంది.

**23.** తే.గీ. *ఎఱుక గలఁ డేని మఱి శక్తుఁ డేని యన్యు*
*లన్యులకు హింస గావించునపుడు దానిఁ*
*బూనిఁ వారింపకున్న నప్పురుషుఁ డేఁగు ।*
*హింస చేసినవారల యేఁగుగతికి.*

**ఆదిపర్వము – సప్తమాశ్వాసము – 146**

**తాత్పర్యము:** జ్ఞానవంతుడు, సమర్థుడు అయినవాడు ఒకరు మరొకరిని హింసించే సమయంలో ప్రయత్నించి ఆ హింసను ఆపకపోతే, అతడు కూడా ఆ హింస చేసిన వానిగతినే పొందుతాడు. (నరకాన్ని పొందుతాడు) అని అర్థం.

**సందర్భము:** భృగువంశం వాడు, తొడ నుండి పుట్టినవాడు అయిన ఔర్యుని చూచిన వెంటనే కృతవీర్యుని వంశంలో పుట్టిన క్షత్రియులంతా దృష్టి కోల్పోయి, పర్వతశ్రేణుల్లో తిరుగుతూ ఉండిపోయారు. తరువాత వాళ్ళు భృగుపత్నిని వేడుకొనగా, ఆమె తన కుమారుని వేడుకోమని సలహాయిస్తుంది. వారు ఔర్యుని ప్రార్థించగా వాళ్ళ దృష్టి వాళ్ళకి తిరిగి వస్తుంది. అప్పుడు ఆయన వంశీయులైన పితృదేవతలు ఆయన వద్దకు వచ్చి, ఆయనను శాంతింప చేయడానికి ప్రయత్నించినప్పుడు ఔర్యుడు పలికిన మాటలివి. ఎంతో అర్థవంతమైన సూక్తి కదా!

**24.** ఆ. *'గురులలోన బరమగురువు దల్లియ, యట్టిఁ*
*తల్లి వచనమును, విధాతృకృతము*
*నన్యథాకరింప నలవియే?" యనిన నం*
*దొఱకు నిట్టు లనియె ద్రుపదవిభుడు.*

**ఆదిపర్వము - సప్తమాశ్వాసము - 254**

**తాత్పర్యము:** "గురువులలో తల్లి ఉత్తమ గురువు. అటువంటి తల్లి మాటను, బ్రహ్మ చేసిన పనిని, మార్పు చేయటం సాధ్యమా?" అని ధర్మరాజు ద్రుపదునితో పలుకుతాడు.

**సందర్భము:** ద్రౌపతీ స్వయంవరానంతరం కుంతీదేవి అన్న మాట ప్రకారం, ద్రౌపదిని పాండవులు ఐదుగురూ వివాహం చేసుకోవాలని ధర్మరాజు చెబుతాడు. అయితే ద్రుపదుడు అది ధర్మం కాదని అనుమానం వ్యక్తం చేసినప్పుడు వ్రాయబడిన పద్యం. తరువాత వ్యాసుడు ప్రత్యక్షమై 'ఇంద్రసేన' యను పతివ్రత కథచెప్పి, అలా చేయటం ధర్మమే అని ద్రుపదుడికి తెలియచెప్పి వివాహం జరిపించుమంటాడు.

**విశేషము :** 'గురువులలో కెల్ల మొదటి గురువు తల్లి' అన్న సత్యాన్ని చాటి చెప్పే ఈ నన్నయగారి సూక్తి ఎంతో ఆదరణీయమైనది.

**25.** ఆ. *కీర్తి లేనివానికిని జీవనంబు ని*
*రర్థకంబ చూవె! యవనిమీఁద*
*నిత్య మయిన ధనము నిర్మల కీర్తియ,*
*యట్టి కీర్తి వదయు టశ్రమంబె?*

**ఆదిపర్వము - అష్టమాశ్వాసము - 31**

**తాత్పర్యము:** కీర్తి లేని వాని జీవితం వ్యర్థం. భూమి మీద శాశ్వతమైన ధనం నిర్మలమైన కీర్తి మాత్రమే! అలాంటి కీర్తిని పొందడం సులభసాధ్యం కాదు.

**26.** క. *ఇలఁ గీర్తి యెంత కాలము*
*గలిగి ప్రవర్తిల్లె నంతకాలంబును ని*
*త్యుల కారె కీర్తి గల పు*
*ణ్యులు, కీర్తివిహీనుఁడెందునుం బూజ్యుండే.*

ఆదిపర్వము, అష్టమాశ్వాసము - 32

**తాత్పర్యము:** లోకంలో కీర్తి ఎంత కాలం నిలచి ఉంటుందో, కీర్తి మంతులైన పుణ్యాత్ములు అంతకాలం పాటు ఈ లోకంలో జీవించే ఉంటారు. కీర్తిలేని వాడు ఎక్కడైనా పూజింపబడతాడా? (పూజింపబడడు) అని అర్థం.

**సందర్భము:** భీష్మ ద్రోణులు దుర్యోధనునికి బుద్ధిచెపుతూ పలికిన పలుకులివి. తండ్రి, తాతల రాజ్యం మీద నీకెంత అధికారం ఉందో పాండవులకు కూడా అంతే ఉంది. కాబట్టి వాళ్ళకు అర్ధరాజ్యం యిచ్చి, నీకు, నీ కుటుంబానికీ, లోకానికీ మేలు కలుగచేయి. అలా కాకపోతే అపకీర్తి పాలవుతావు. కీర్తిని నిలుపుకొనడమే క్షత్రియులకు జన్మఫలం. కీర్తి మాత్రమే శాశ్వతమైన ధనం. కీర్తి, అపకీర్తి జనులకి స్వర్గ, నరకాలతో సమానం. అందువలన అపకీర్తిని వదలి కీర్తిని నిలుపుకొమ్ము అని చెబుతాడు.

**విశేషము :** నన్నయగారు ఆదిపర్వము - అష్టమాశ్వాసములో వరుసగా 31, 32 సంఖ్య గల పద్యాలలోనూ, 30, 33 సంఖ్య గల వచనం లోనూ 'కీర్తి' యొక్క గొప్పదనాన్ని వివరించారు. ఇవి నన్నయగారు 'కీర్తి' గొప్పతనాన్ని వివరించే రుచిరార్థ సూక్తులు.

మంచిచెడ్డల ఎరుక కలిగి జీవించడం నేర్చుకున్నప్పుడే మన వ్యక్తిత్వం వికసించినట్లుగా భావించాలి.



శీలం, వ్యక్తిత్వం వికసించడానికి విద్యాభ్యాసంలో గురుశిష్యుల మధ్య ఎంతో అన్యోన్యత ఉండాలి.

**27.** క. *'ధరణీసురవరులకుఁ గడు*
*సెరగై నెడ నెఱిఁగి యెడయు జేయుదురె మహా*
*పురుషు' లని నరుఁడు విలుగొని*
*యరిగెను ౘ్రుచ్చులపిఱుంద నవ్విప్రుపనిన్.*

**ఆదిపర్వము – అష్టమాశ్వాసము – 119**

**తాత్పర్యము:** బ్రాహ్మణోత్తములకు ఆపద సంభవిస్తే, ఆ సంగతి తెలిసిన మహాపురుషులు మొహం చాటేస్తారా? అని అర్జునుడు ధనుస్సు తీసుకొని ఆ బ్రాహ్మణుని పనిమీద ఆ దొంగల వెంట పడ్డాడు.

**సందర్భము:** పాండవులు అరణ్యవాసంలో ఉండగా ఒకనాడు ఒక వృద్ధ బ్రాహ్మణుడు, తన గోవును దొంగలు తోలుకుపోతున్నారని, తన గోవుని రక్షించుమని అర్జునుని ప్రార్థిస్తాడు. అపుడు అర్జునుడు తమ అన్నదమ్ముల మధ్య ఉన్న ఒప్పందం ప్రకారం ద్రౌపదీ ధర్మరాజులు నివసిస్తున్న ఆయుధాగారం లోకి తాను వెళ్ళకూడదని తెలిసికూడా, క్షాత్రధర్మాన్ని అనుసరించి, అక్కడికి వెళ్ళి, తన ధనుస్సును తీసుకొని ఆ బ్రాహ్మణుని వెంట వెళ్ళాడు. ఆపదలో ఉన్నవారిని ఆదుకోవాలన్నది నన్నయగారి రుచిరార్థసూక్తి.

**28.** క. *భూజనపరివాదం బ*
*వ్యాజంబునఁ బరిహరింపవలయును మనకున్*
*వ్యాజమున ధర్మలోపం*
*బాజిజయా! పరిహరింతురయ్య మహాత్ముల్.*

ఆదిపర్వము – అష్టమాశ్వాసము – 123

**తాత్పర్యము:** ఓ ధర్మరాజా! అకారణంగా ప్రజల వలన కలిగిన నిందల నయినా నిర్లక్ష్యం చేయకుండా పరిహరించడం రాజధర్మం. అటువంటిది, ఏదోసాకు చెప్పి మనవంటి వారు ధర్మాన్ని తప్పటాన్ని పెద్దలైనవారు అంగీకరిస్తారా!"

**సందర్భము:** అరణ్యవాసంలో ఉన్నప్పుడు నారదుని ఆజ్ఞ మేరకు పాండవులు ఒక నియమం ఏర్పాటు చేసుకుంటారు. దాని ప్రకారం ద్రౌపది ప్రేమతో ఒక్కొక్కరి ఇంట ఒక్కొక్క సంవత్సరం క్రమంగా ఉండటానికి, ద్రౌపది ఉన్న ఇంటివైపు ఇతరులు వెళ్ళకుండా ఉండాలని, ఒకవేళ ఎవరయినా తెలిసో, తెలియకో వెళితే, అతడు పన్నెండు

నెలలు తీర్థయాత్రలు చేయాలని ఒక అంగీకారానికి వచ్చారు. అయితే ఒకరోజు ఒక బ్రాహ్మణోత్తముడు వచ్చి తన గోవును దొంగలు తోలుకు పోతున్నారని, ఆ దొంగల నుండి తన గోవును రక్షించుమని అర్జునుడిని కోరతాడు. అపుడు అర్జునుడు, ధర్మరాజు ద్రౌపదితో కూడి ఆయుధాగారంలో ఉన్నాడని తెలిసికూడా, అక్కడికి వెళ్ళి ధనుస్సు తీసుకొని దొంగలను వెంబడించి గోరక్షణ చేస్తాడు. కాని నియమోల్లంఘనం జరిగినందున సంవత్సరం పాటు తీర్థయాత్రలకు వెళ్తానని అంటాడు. అప్పుడు ధర్మనందనుడు నీవు దొంగలను చంపి, బ్రాహ్మణునకు మేలు చేశావు. గోవులకు, బ్రాహ్మణులకు బాధలను తొలగించే జనులకు పాపాలు అంటవు అని అంటాడు. ఆ సందర్భంలో అర్జునుడన్న మాటలివి.

**విశేషం :** 'సీజర్స్' వైఫ్ షల్ నాట్ ఓన్లీ బి ఛేస్ట్ బట్ షల్ బి ఎబౌవ్ సస్‌పిషన్' అంటాడు షేక్స్‌పియర్ తన జూలియస్ సీజర్ నాటకంలో. అంటే సీజర్ యొక్క భార్య పాతివ్రత్యంతో ఉండడమే కాదు ఇతరులకు ఎలాంటి అనుమానాలకు కూడా తావియ్యకూడదని దాని తాత్పర్యం. మన రాజకీయనాయకులు ఈ విషయంలో నేర్చుకోవలసింది చాలా ఉంది. పరిపాలకులు తాము నిజాయితీగా ఉండడమే కాదు, అనుమానానికి ఆస్కారం కూడా లేకుండా వ్యవహరించాల్సిన అవసరం ఉంది. ఇది నన్నయ గారి మరో చక్కని సూక్తి.

**29.** వ. *శరణాగతరక్షణత*
*త్పరుఁడు ధనంజయుఁడు మయునిప్రాణము గాచెం,*
*గరుణను శరణాగతులగు ।*
*పురుషుల రక్షించునంత పుణ్యము గలదే.*

**ఆదిపర్వము - అష్టమాశ్వాసము - 291**

**తాత్పర్యము:** శరణుకోరిన వారిని రక్షించడమే నియమంగా కలవాడయిన అర్జునుడు మయుని ప్రాణాలు కాపాడాడు. శరణుకోరిన వారిని రక్షించటం వంటి పుణ్యకార్యం ఇంకొకటి కలదా! (లేదు అని అర్థం).

**సందర్భము:** ఖాండవవన దహనం జరుగుతున్న సమయంలో నముచి అనే రాక్షసుని తమ్ముడు మయుడు అనేవాడు, ఖాండవవనం నుండి బయటక పడలేక, తనను అగ్ని చుట్టు ముట్టగా, శ్రీకృష్ణుడు ఆతనిని చంపడానికి రాగా మిక్కిలి భయంతో అర్జునుని శరణువేడి అతని మాటున నిలబడతాడు. అప్పుడు అర్జునుడు శరణువేడిన ఆ మయుని రక్షిస్తాడు. ఆ సందర్భంగా వ్రాసిన పద్యమిది. శరణాగత రక్షణకు మించిన మహాపుణ్యకార్యం వేరొకటి లేదని ప్రవచించిన ఈ సూక్తి నన్నయగారి సూక్తులలో మకుటాయమానం.

**30.**చ. *కడుఁ జనువాఁడునై పురుషకారియు దక్షుఁడు నైన మంత్రి పెం*
*పడరఁగ రాజపుత్రుల మహాధనవంతులఁ జేసి వారితో*
*నొడఁబడి పక్ష మేర్పడఁగ నుండఁడుగా, ధన మెట్టి వారికిం*
*గడుకొని చేయకుండునె జగన్నుత! గర్వము దుర్విమోహమున్.*

**సభాపర్వము – ప్రథమాశ్వాసము – 32**

**తాత్పర్యము:** మిక్కిలి పలుకుబడి, క్రియాశీలత, సమర్థత గల మంత్రి తన పరిధి మీరి ఇతర రాజ పుత్రులను ధనవంతులుగా చేసి, వారితో చేతులు కలిపి నీకు వ్యతిరేక పక్షాన్ని ఏర్పాటు చేసేటట్లు ప్రవర్తించుట లేదు కదా! ఎందుకంటే ధర్మరాజా! ధనం ఎంతటి వారికైనా దురాశను, గర్వాన్నీ కలిగిస్తుంది.

**సందర్భము:** శ్రీ కృష్ణుని ఆజ్ఞమేరకు మయుడు ఒక సభాభవనాన్ని నిర్మించి ధర్మరాజుకు ఇస్తాడు. ఆ సందర్భంగా వచ్చిన నారద మహాముని ధర్మరాజుకు కొన్ని రాజనీతి విషయాలను వివరిస్తూ చెప్పిన మాటలివి. ఈ సూక్తి ఈ నాటికీ నిజమే అనిపిస్తుంది కదూ! ఇటువంటి మంత్రులను మనం ఈ కాలంలో చాలామందిని చూస్తున్నాము.

**31.** క. కృత మెఱిఁగి కర్త నుత్తమ
మతుల సభల సంస్తుతించి మఱవక తగు స
త్కృతి సేయుదె? కృత మెఱిఁగెడు
పతియె జగజ్జనుల నెల్లఁ బరిపాలించున్.

**సభాపర్వము - ప్రథమాశ్వాసము - 46**

**తాత్పర్యము:** చేసిన పనులను గుర్తించి అటువంటి మంచి పనులు చేసిన వారిని విద్వత్సభలలో సన్మానిస్తున్నావా? మంచి పనులు చేసే వారిని గుర్తించే ప్రభువే లోకపాలకుడవుతాడు.

**సందర్భము:** ఇది కూడా నారదుడు ధర్మరాజుకు బోధించిన రాజనీతి విశేషమే. బాగా పని చేసే వారిని గుర్తించి వారిని ప్రశంసించడం, సన్మానించడటం వంటివి చేయటం ద్వారానే ప్రభువు లోకపాలకుడవుతాడని, అంతకంటే ఉత్తమ మార్గం వేరొకటి లేదని నన్నయగారి సూక్తి.

**32.** ఆ. వార్తయంద జగము వర్తిల్లుచున్నది,
యదియు లేనినాఁడ యఖిలజనులు
నంధకారమగ్ను లగుదురు గావున ।
వార్త నిర్వహింపవలయుఁ బతికి.

సభాపర్వము - ప్రథమాశ్వాసము - 51

**తాత్పర్యము:** ప్రపంచం అంతా వార్తల మీదనే ఆధారపడి నడుస్తోంది. అవి లేనినాడు జనులు అజ్ఞానాంధకారంలో మునిగిపోతారు. అందుచేత ప్రభువు వార్తలను బాగా ప్రచారం చేయాలి.

**సందర్భము:** ఇది కూడా నారదుడు ధర్మరాజుకి బోధించిన ధర్మాలలో ఒకటి. ప్రభువైనవాడు వార్తలను సమర్థవంతంగా నిర్వహించాలని, ప్రజలకు ఎప్పటికప్పుడు రాజ్యంలో జరుగుతున్న విశేషాలను తెలియచేయాలని, ప్రజలను ప్రభుత్వ కార్యకలాపాల పట్ల చైతన్య వంతులను చేయాలని సందేశం. ఈనాటి ప్రజాస్వామ్య వ్యవస్థలో దీని విశిష్టత ఏమిటో ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

**33.** క. *ఆరంభరహితుఁ బొందునె*
*యారయ సంపదలు? హీనుఁడయ్యును బురుషుం*
*డారంభశీలుడయి యకృ*
*తారంభులఁ నోర్చు నెంత యధికుల నయినన్.*

**సభాపర్వము – ప్రథమాశ్వాసము – 123**

**తాత్పర్యము:** లోకంలో ప్రయత్నమే చేయని వానికి సంపదలు సమకూరవు. తాను ఎంతటి బలహీనుడైనా పురుష ప్రయత్నంతో, ప్రయత్నమే చెయ్యని ఎంతమంది బలవంతులనైనా అవలీలగా జయించగలడు.

**సందర్భము:** నారదుడు యుధిష్ఠిరుని రాజసూయ యాగం చేయుమని చెబుతాడు. ధర్మరాజు ఆ విషయంపై ఆలోచిస్తుండగా భీమార్జునులు ధర్మరాజుకు ఉత్సాహం కలిగిస్తున్న సందర్భంలో వ్రాసిన పద్యం. ప్రయత్నం చేతనే ఫలితాలు అందుతాయని, ప్రయత్నహీనులకు కార్యసిద్ధి జరగదని నన్నయగారి సూక్తి. ఈ సందర్భంలో 'ఆరంభించరు నీచమానవులు' అనే శతకపద్యం గుర్తుకు వస్తుంది.

**34.** ఆ. *కారణంబు లేక దారుణుఁడయి సాధు*
*హింస సేయు కుజనుఁ డెల్లవారి*
*కప్రియుండ కాక యప్రియలక్షణం*
*బొండు గలదె తలఁప నుత్తములకు?*

**సభాపర్వము – ప్రథమాశ్వాసము – 189**

**తాత్పర్యము:** ఓ జరాసంధా! అకారణంగా సాధు జనులను హింసించే వాడు అందరికీ శత్రువే! ఆలోచిస్తే మంచి వారికి ఇంతకంటె వైర కారణం వేరొకటి ఏముంది?

**సందర్భము:** జరాసంధుని ఇంటి దొడ్డిమార్గాన బ్రాహ్మణవేషాలలో ప్రవేశించిన శ్రీకృష్ణ, భీమ, అర్జునులను చూచిన జరాసంధుడు వారితో మీకేమి కావాలని అగుడుతాడు. అప్పుడు వాళ్ళు నీతో యుద్ధాన్ని కోరుతున్నామని చెపుతాకు. అపుడు ఆ జరాసంధుడు నేను దేవతలకు, మునిశ్రేష్ఠులకు, బ్రాహ్మణులకు భక్తుణ్ణి. ఉత్తమ క్షత్రియ ధర్మాలనాచరించేవాడిని, అలాంటి నాతో మీకు వైరం ఎందుకు? అని అడిగిన సందర్భంలో వ్రాయబడిన పద్యం. సాధుజనులను హింసించే దుష్టుడు అందరికీ శత్రువే అని నన్నయగారి సూక్తి.

**35.** క.  *భూరిగుణోన్నతు లనఁదగు*
*వారికి ధీరులకు ధరణివల్లభులకు వా*
*క్పారుష్యము చన్నె? మహా*
*దారుణ మది విషముకంటె దహనముకంటెన్.*

**సభాపర్వము – ద్వితీయాశ్వాసము – 17**

**తాత్పర్యము:** గొప్పగుణాలు కలిగి శ్రేష్ఠులన దగినవారు, పండితులు, ప్రభువులు కఠినంగా మాట్లాడటం తగునా? వాక్పారుష్యము విషము కంటె, అగ్నికంటె భయంకరమైనది కదా!

**సందర్భము:** ధర్మరాజు రాజసూయ యాగం చేస్తూ భీష్ముని సలహా మీద శ్రీకృష్ణునికి అగ్రపూజ చేయ నిర్ణయిస్తాడు. శ్రీకృష్ణుడంటే కిట్టని శిశుపాలుడు, ఆ గోపాలుడు అగ్రపూజకు అర్హుడు కాడని సభలో నిందిస్తాడు. అప్పుడు శిశుపాలునితో ధర్మరాజు అన్న మాటలు ఇవి. నన్నయ గారి సూక్తులలో ఇదొక సుప్రసిద్ధమైన సూక్తి.

**36.** తే.  ఉత్తమ జ్ఞానవృద్ధు నా నుండె నేని
బాలుఁ డయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు;
క్షత్త్రియుఁడు పూజ్యుఁ డమితవిక్రమసమృద్ధి
నుర్విపతులలో నధికుఁడై యుండె నేని

**సభాపర్వము – ద్వితీయాశ్వాసము – 25**

**తాత్పర్యము:** ఉత్తమ జ్ఞానం చేత గొప్పవాడయి, వయస్సులో బాలుడయినా బ్రాహ్మణుడు పూజింప తగినవాడు. అలాగే అపరిమితమైన పరాక్రమంతో రాజుల్లో అధికుడైతే క్షత్రియుడు పూజార్హుడవుతాడు.

**సందర్భము:** ఇది కూడా రాజసూయ యాగం సందర్భంలో వ్రాయబడిన పద్యమే! భీష్ముడు శిశుపాలుని నిందించి, రాజసూయ యాగంలో అగ్రపూజ నందుకోవడానికి కేవలం వయస్సు ఉంటే సరిపోదని ఉత్తమ జ్ఞానం, పరాక్రమ సమృద్ధి కలిగి మురుడనే రాక్షసుని సంహరించిన ఆ శ్రీకృష్ణుడే అర్ఘ్యానికి అర్హుడని తెలియజేస్తాడు. నన్నయగారి ఈ సూక్తి సుధానిధిత్వానికి ఇదొక చక్కని ఉదాహరణ.

**37.** తే. *ఒలసి నీ పుత్రులెల్ల నొండొరులతోడ*
*నె ట్లొడంబడి యుండుదు రట్ల చేయ*
*వలయుఁ; దమలోన జూదంబు నాడు నగుటఁ*
*గలహ మూలంబ యెట్టి శాంతులకు నైన.*

**సభాపర్వము - ద్వితీయశ్వాసము - 131**

**తాత్పర్యము:** నీ పుత్రులంతా (అంటే కౌరవులు, పాండవులు) ఒకరితో ఒకరు ఎలా కలసి మెలసి ఉంటారో అలా చెయ్యి. ఎంత శాంత స్వభావులైనా, జూదం వాళ్ళలో వాళ్ళకు తగవులు వచ్చి శత్రుత్వానికి దారి తీస్తుంది.

**సందర్భము:** దుర్యోధనుని ప్రోద్బలంతో ధృతరాష్ట్రుడు విదురునితో చెప్పి పాండవులను జూదానికి ఆహ్వానించి తీసుకురమ్మని కోరుతాడు. అప్పుడు విదురుడు ధృతరాష్ట్రునితో అన్న మాటలివి. జూదం అన్నదమ్ముల మధ్య కలహకారణం అవుతుందనీ, వాళ్ళు కలసి మెలసి ఉండే పద్ధతిని ఆలోచించమని హితవు చెబుతాడు విదురుడు. 'జూదం కలహాలకి మూలం' అన్న నన్నయ గారి సూక్తి నేటికీ వర్తిస్తుంది.

**38.** తే. *విదురుమతము పాండవేయహితార్థంబు*
*వానిబుద్ధి నెగడవలవ; ధన్య*
*పక్షపాతబుద్ధిఁ బరఁగుచు నుండెడు*
*నట్టి వాని నాప్తుఁ దనఁగ నగునె?*

**సభాపర్వము - ద్వితీయాశ్వాసము - 150**

**తాత్పర్యము:** విదురుడు ఎల్లపుడూ పాండవ పక్షపాతే! అందువలన అతడు చెప్పినట్లు మనం చెయ్యకూడదు. పక్షపాత బుద్ధి కలవాడిని ఆప్తుడని అనుకోవచ్చా? (అనుకోరాదు) అని భావం.

**సందర్భము:** శకుని ప్రోద్బలంతో దుర్యోధనుడు, తండ్రి ధృతరాష్ట్రుని సమీపించి పాండవులను సుహృద్ద్యూతానికి రమ్మని కబురంపమని చెబుతాడు. అందుకు ఒడంబడని ధృతరాష్ట్రుడు తాను విదుర శాసనానికి లోబడి నడచుకుంటానని, అతడు న్యాయాన్యాయాలు బాగా తెలిసినవాడు. మనకు ఆప్తుడు. "జూదంవల్ల యుద్ధం కలుగుతుందని చెప్పాడు. ఆ మాటలో ధర్మం ఉంది" అంటాడు. ఆ సందర్భంలో దుర్యోధనుడు తండ్రితో "పక్షపాత బుద్ధితో కూడినట్టి వానిని ఆప్తుడని ఎలాగంటాం?" అని ప్రశ్నిస్తాడు.

**39.** తే. *క్షత్రనీతిక్రమంబులు గావు సూవె*
*నికృతియును జూదమును, ధర్మనిత్యులైన*
*వారి కీ రెండు వర్జింపవలయు నెందుఁ,*
*బాపవృత్తంబు జూదంబు పార్థివులకు.*

**సభాపర్వము – ద్వితీయాశ్వాసము – 166**

**తాత్పర్యము:** మోసం, జూదం క్షత్రియ ధర్మానికి తగినవి కావు. ఎప్పుడూ ధర్మాన్ని ఆచరించే వాళ్ళు ఈ రెండింటిని వదలి వేయాలి. రాజులకు జూదం ఆడటం పాపం.

**సందర్భము:** దుర్యోధనుడు జూదమాడడానికి ఆహ్వానించగా వచ్చిన ధర్మరాజు జూదం గురించి పలికిన మాటలివి. మోస మార్గాలను అనుసరించే నీచపు జూదగాళ్ళతో జూదమాడకూడదని, అలాచేయడం వలన ఎటువంటి వాళ్ళయినా ధనాన్ని, ధర్మాన్ని కోల్పోతారని కూడా చెబుతాడు.

**విశేషము:** నన్నయగారి నానారుచిరార్థ సూక్తి నిధిత్వానికి ఇది గొప్ప ఉదాహరణ. వరుసగా 166, 167 పద్యాలు, 168 వచనంలో ద్యూతవ్యసనం గురించి చక్కని సూక్తులనందించారు.

వివేకశూన్యుడైన మిత్రుడు, వివేకవంతుడైన శత్రువు కంటే ప్రమాదం.



నెరసిన తల వయస్సును సూచిస్తుంది కానీ, వివేకాన్ని కాదు.



నిన్నటికంటే నేడు నీ వివేకం పెరగకపోతే మరొక రోజు
వ్యర్థమైందని తెలుసుకో.



ఖాళీ సమయాన్ని సద్వినియోగపరచుకునే వారే వివేకవంతులు.

**40.** తే. *ప్రియము పలికెడువారిన పెద్ద మెత్తు*
*రప్రియంబును బథ్యంబునైన పలుకు*
*వినఁగ నొల్లరు, గావున వేడ్కదానిఁ*
*బలుక రెవ్వరు నుత్తమప్రతిభు లయ్యు.*

**సభాపర్వము – ద్వితీయాశ్వాసము 191**

**తాత్పర్యము:** వినటానికి ఇంపైన మాటలు చెప్పేవారిని ఎక్కువగా మెచ్చుకుంటారు. మేలు చేసేవైనా వినటానికి ఇంపుగా ఉండని మాటలను వినటానికి ఎవరూ ఇష్టపడరు. అందువల్ల మంచి మాటలను మంచి ప్రతిభావంతులు కూడా పలుకరు.

**సందర్భము:** పాండవులను జూదానికాహ్వానించి, శకుని సాయంతోనూ మాయా ద్యూతంలో గెలిచిన దుర్యోధనుని చూచి విదురుడు జరుగుతున్న అధర్మాన్ని నిలిపి ఈ దుర్మార్గపు జూదాన్ని ఆపమని ధృతరాష్ట్రునికి చెబుతాడు. విదురోపదేశాన్ని వినకుండ ధృతరాష్ట్రుడు ఉపేక్షించాడు. ఆ సందర్భంలో వ్రాయబడిన పద్యం.

**విశేషం:** ప్రియమైన పలుకులనే వినటానికి అందరూ యిష్టపడతారని, మంచిదైనా అప్రియమైన వాక్కును చెప్పటానికి మంచి తెలివి తేటలున్న వారు కూడా ఇష్టపడరని చెప్పి, మొదట వినటానికి అప్రియంగా ఉన్నా, చివరికి మేలు చేసే మాటను ఇష్టులైన వారికి, మొగమాటం లేకుండా చెప్పాలి. అలాంటి వాడే రాజుకి నిజమైన సహాయం చేసేవాడని వరుసగా రెండు పద్యాలలో విదురుని హితవాక్యాలు వినిపిస్తారు.

**41.** తే. *మొదల నప్రియ మయ్యును దుదిఁ గరంబు*
*పథ్య మగు పల్కు ప్రియులందు బలిమి నైనఁ*
*బలుక వలయు మోమోడక యొలసి యట్టి*
*వాడు దగు సహాయుండు భూవల్లభునకు.*

**సభాపర్వము – ద్వితీయాశ్వాసము – 192**

**తాత్పర్యము:** మొదట వినటానికి ఇంపుగా లేక పోయినా, చివరికి మేలు చేసే మాటలను మొగమాటం లేకుండా చెప్పాలి. అలాంటి వాడే రాజుకి తగిన సహాయం చేసేవాడు.

**42.** ఆ.	కుటిలమార్గు లయిన కుత్సితకితవుల
తోడ గడగి జూదమాడఁ జనదు,
దానజేసి యర్థధర్మవివర్జితు
లగుదు రెట్టివారు జగములోన.

**సభాపర్వము – ద్వితీయాశ్వాసము – 167**

**తాత్పర్యము:** మోసపూరిత మార్గాలను అనుసరించే జూదగాళ్ళతో జూదమాడ కూడదు. దానివల్ల లోకంలో ఎటువంటి వారయినా ధనాన్ని, ధర్మాన్ని కోల్పోతారు.

**సందర్భము:** ధర్మరాజుకు దుర్యోధనుని ఆంతర్యం బాగా తెలుసు. దుర్యోధనుడు అక్ష విద్యలో ప్రవీణుడుకాడని, తన మేనమామ శకునితో మోసపూరిత జూదం ఆడించాలని తలపోస్తున్నాడని తెలిసి అన్న మాటలివి. అధర్మ జ్యూదం వలన కలిగే నష్టాలను ధర్మరాజునోట చక్కగా వివరించాడు నన్నయ మహాకవి.

**43.** ఆ.	సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన
నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు
లనృతదోషఫలమునం దర్ధ మొందుదు
రనిరి ధర్మవేదులైన మునులు.

**సభాపర్వము – ద్వితీయాశ్వాసము – 237**

**తాత్పర్యము:** సభకు వచ్చి ఎవరయినా ధర్మ సందేహం అడిగితే, తెలిసికూడా చెప్పని సభ్యులు అసత్య మాడి నందువలన కలిగే ఫలంలో సగం పొందుతారని ధర్మ వేత్తలైన మునులు చెప్పారు.

**44.** ఆ.	*ధర్మ వెఱిఁగి దానిఁదా నొండుగా లాభ।*
*లోభ పక్షపాతలోలబుద్ధి*
*సభల నెవ్వఁడేని సభ్యుఁడై పలుకు వాఁ*
*డనృతదోషఫలము ననుభవించు.*

**సభాపర్వము - ద్వితీయాశ్వాసము - 238**

**తాత్పర్యము:** ధర్మాన్ని ఎరిగి కూడా స్వార్థంతో తన లాభం కోసమో, లోభం చేతనో, పక్షపాతబుద్ధి చేతనో సభలో ఎవరైనా దానిని మరో విధంగా పలికితే అతడు అసత్య దోషంవల్ల కలిగే ఫలాన్ని అనుభవిస్తాడు.

**సందర్భము:** మాయా జూదంలో పాండవులు ఓడిపోయిన తరువాత దుర్యోధనుడు ద్రౌపదిని సభకురావిస్తాడు. అపుడు ఆమె తాను "ధర్మ విజితనా? అధర్మ విజితనా?" అని అడుగుతుంది. అందుకు కౌరవ సభ మొత్తం మౌనాన్ని వహిస్తుంది. సాహసం చేసి "ఆమె అధర్మ విజిత" అని పలికిన వికర్ణుని, కర్ణుడు ఇంత మంది పెద్దలున్న సభలో చిన్నవాడివి నీకీ అధిక ప్రసంగం ఎందుకని, పలికి అతనిని కూర్చోమంటాడు. ఆ సందర్భంగా వ్రాసిన పై రెండు పద్యాలు నన్నయగారి రుచిరార్థ సూక్తికి నిదర్శనాలు. సభకి వచ్చి ధర్మ సందేహం అడిగితే, ఎరిగి కూడా సమాధానం చెప్పనివాళ్ళు అబద్ధమాడిన దోషాన్ని పొందుతారని, అలాగే ధర్మ మెరిగి కూడా తనసొంత లాభం కొరకో పక్షపాత బుద్ధితోనో దానిని వేరే విధంగా పలికినా కూడా అసత్యదోష ఫలాన్ని అనుభవిస్తారని కవి సూక్తి.

**45.** క.	*మనమున వేరమిఁ దలఁపమి*
*యును, సక్షమచిత్తుఁ డగుటయును, గుణములు కై*
*కొని దోషమ్ములు విడుచుట*
*యును నుత్తముఁ డయిన పురుషు నుత్తమగుణముల్.*

**సభాపర్వము - ద్వితీయాశ్వాసము - 266**

**తాత్పర్యము:** మనస్సులో వైరభావాన్ని పెట్టుకోక పోవడం, ఓర్పుతో కూడిన మనస్సు కలవాడై ఉండటం, గుణాలను గ్రహించి దోషాలను వదలివేయడం- ఉత్తమవ్యక్తి యొక్క మంచి గుణాలు.

**సందర్భము:** మాయా జ్యూదంలో పాండవులు ఓడిపోయిన తరువాత కౌరవులు ద్రౌపదిని సభకు రావించి అవమానించి వలువలొలిచే ప్రయత్నం చేసి, భంగపడతారు. ఆమె పాతివ్రత్యాన్ని శ్రీకృష్ణుడు కాపాడుతాడు. అపుడు సంతోషించిన ధృతరాష్ట్రుడు ఆమెను ఏదయినా వరం కోరుకోమని అడుగుతాడు. అపుడామె మొదటి వరంగా ధర్మరాజును దాస్యవిముక్తుడిని చేయమని, రెండోవరంగా మిగిలిన పాండవులను దాస్యవిముక్తులను చేయమని కోరుతుంది. అపుడు ధృతరాష్ట్రుడు మరోవరం కోరుకోమనగా ఉత్తమ క్షత్రియ కాంత రెండువరాలకు మించి కోరుకోరాదని చెబుతుంది. అందుకు సంతోషించిన ధృతరాష్ట్రుడు పాండవులకు వారి రాజ్య సర్వస్యం యిచ్చి పంపుతాడు. ఆ సందర్భంలో వ్రాసిన పద్యం. మానవత్వానికి మార్గదర్శనం చేసే చక్కటి సూక్తి యిది.

**46.** క. *అర్థమ యనర్థ మూలం*
*బర్థమ మాయా విమోహనావహము, నరుం*
*డర్థార్జన దుఃఖమున న*
*పార్థీకృతజన్ముఁడగుట పరమార్థ మిలన్.*

**అరణ్యపర్వము - ప్రథమాశ్వాసము - 28**

**తాత్పర్యము:** అన్ని చెడుగులకీ ధనమే మూలకారణం. ధనం మాయ చేత ఏర్పడిన మోహాన్ని కలిగించేది. మనుజుడు ధనసంపాదన వలన ఏర్పడే దుఃఖము వలన మానవజన్మ పరమార్థాన్ని మరచిపోవాడు. ఇది పరమ సత్యం.

**సందర్భము:** అరణ్యంలో ఉన్న పాండవులను చూడటానికి వచ్చిన శౌనకుడు ధర్మరాజుకు ధర్మాలు చెబుతూ ధనాశ మంచిది కాదని చెప్పే సందర్భంలో వ్రాసిన పద్యం. ఇది నేటికీ నిజం. ఇది నన్నయ గారి సూక్తి నిధిత్వానికి మచ్చుతునక.

**47.** ఆ. *కార్యగతులతెఱఁగు కలరూపు సెప్పిన*
*నధికమతులు దాని నాదరింతు,*
*రల్పకార్యబుద్ధు లగువారలకు నది*
*విరసకారణంబు విషమ పోలె.*

**అరణ్య పర్వము – ప్రథమాశ్వాసము – 59**

**తాత్పర్యము:** ఉన్నదున్నట్లు చెబితే, గొప్పబుద్ధి కలవాళ్ళు ఆదరిస్తారు. కాని నీచకృత్యాలకు పాల్పడే వారికి, అది విషం వలె బుద్ధికి విరసంగా ఉంటుంది.

**సందర్భము:** పాండవులు అరణ్యవాసానికి వెళ్ళిపోయిన తరువాత ధృతరాష్ట్రుడు ఒకరోజు విదురుడిని పిలిచి ఇక మీద పాండవులు ఏమి చేస్తారు? అని ప్రశ్నిస్తాడు. అందుకు సమాధానంగా విదురుడు వారు బలవంతులు, తేజోవంతులు అని చెప్పి ఇప్పటికైనా మించిపోయింది లేదు. ధర్మరాజుని పిలిచి రాజ్యపట్టాభిషిక్తుడిని చెయ్యి అని చెపుతాడు. అందుకు ఆగ్రహించిన ధృతరాష్ట్రుడు "నువ్వా పాండవుల దగ్గరకే పో!" అని అంటాడు. అప్పుడు విదురుడు అరణ్యవాసంలో ఉన్న పాండవుల వద్దకు వెళ్తాడు. అప్పుడు పాండవులు అతనిని గౌరవించి వచ్చిన కారణం అడుగగా, తాను జరిగిన వృత్తాంతం చెబుతూ అన్న మాటలివి. ఈ పద్యం నన్నయగారి సూక్తిరత్నాలలో ఒకటి.

**48.** క. *సుజనుల సహవాసంబునఁ*
*గుజనులు సద్ధర్మమతు లగుట నిక్కము, ధ*
*ర్మజునొద్ద నుండి నీ యా*
*త్మజుఁడు ప్రశాంతుండు ధర్మమార్గుండు నగున్.*

**అరణ్యపర్వం – ప్రథమాశ్వాసము – 88**

**తాత్పర్యము:** మంచివారిమైత్రి వలన చెడ్డవారు కూడా మంచివారుగా మారుతారు. ధర్మరాజు వద్ద నుంటే నీ కొడుకు సుయోధనుడు కూడా ధర్మమార్గుడు, ప్రశాంతుడు అవుతాడు.

**సందర్భము:** ధృతరాష్ట్రునికి వ్యాసుడు "ఇంద్ర సురభి" సంవాదం చెప్పి, ధృతరాష్ట్ర మహారాజా! నీకు గల పుత్రప్రేమ అసాధారణమైనది. ఐనను అడవులలో క్రుగ్గుతున్న పాండవుల పట్ల దయచూపించు అంటూ ధర్మరాజు సాంగత్యంలో దుర్యోధనుడు మంచి వాడుగా మారతాడని చెప్తాడు. ఆ సందర్భంగా చెప్పిన పద్యం ఇది. ఇది నిజమే కదా! సజ్జన సాంగత్యం ఎంతో మేలు చేస్తుంది.

**49.** తే.
*బలము గలవానిఁ బలువురు బలవిహీను*
*లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి*
*మధువుఁ గొన నుత్సహించిన మనుజుఁబట్టి*
*కుట్టి నిర్జించు మధుకరకులమునట్లు.*

**అరణ్య పర్వము - ప్రథమాశ్వాసము - 251**

**తాత్పర్యము:** బలం కలవాడిని పెక్కుమంది బలహీనులు చేరి, ఏకమై తేనెను తీసుకొనటానికి యత్నించిన మనుష్యుడిని, పట్టి కుట్టి చంపే తేనెటీగల గుంపులవలె జయిస్తారు.

**సందర్భము:** ఇది భీమసేన ధర్మరాజుల మధ్య జరిగిన సంవాదంలో భీమసేనుడు పలికిన మాటలు. భీమసేనుడు ధర్మరాజును రెచ్చగొడుతూ ధర్మం, నీతి, న్యాయం అంటూ ఇలా చేతులు ముడుచుకుని కూర్చోవటం క్షత్రియధర్మం కాదని, తన తమ్ముల భుజశక్తితో కౌరవులపై తన మిత్ర రాజులతో కలిసి యుద్ధానికి వెళ్ళి, కౌరవులను నిర్జించి, రాజ్యాన్నికైవశం చేసుకోమని కోరిన సందర్భంలో వ్రాసిన పద్యం. 'బలవంతమైన సర్పము, చలిచీమల చేత చిక్కి చావదె సుమతీ' అన్న పద్యం మనకు ఈ సందర్భంలో గుర్తుకు వస్తుంది. చక్కని సూక్తి.

**50.** క.
*వగవఁగ సాంగోపాంగము*
*లగు నాలుగు వేదములయు నధ్యయనము పో*
*ల్పఁగ నొక సత్యముతో నెన*
*యగునే? యెవ్వియును బోల వటె సత్యంబున్.*

అరణ్య పర్వము – ద్వితీయా శ్వాసము – 831

**తాత్పర్యము:** ఆలోచించి చూస్తే నాలుగు వేదాలు, వేదాంగాలు చదివినప్పటికీ, ఆ వైదిక వాఙ్మయ పరిజ్ఞానం అంతా ఒక సత్యంతో సరితూగదని చెబుతారు.

**సందర్భము:** ఇది నలదమయంతోపాఖ్యానం లోనిది. నలుడు దమయంతి నిద్రిస్తుండగా, అడవిలో ఆమెను ఒంటరిగా విడచి, వెళ్ళిపోతాడు. అప్పుడు దమయంతి రోదిస్తూ పలికిన పలుకులివి. 'సత్యం' యొక్క గొప్పదనాన్ని ఎలుగెత్తి చాటే ఈ పద్యం నన్నయగారి సూక్తి సుధానిధిత్వానికి ఒక ఉదాహరణ.

**51.** క.
*చనుదెంచి తరుణి మునినం*
*దను చిత్తంబునకు వైకృతముఁ జేసి, విలా*
*సినుల సహాలాప సహా*
*సన సహయానములు బంధసమములు గావే!*

**అరణ్యపర్వము – తృతీయాశ్వాసము – 111**

**తాత్పర్యము:** వేశ్యాపుత్రిక అయిన లేజవరాయి వచ్చి ఋషి కుమారుడైన ఋష్యశృంగుని మనస్సులో వికారాన్ని కలిగించింది. విలాసవంతులయిన స్త్రీలతో కలసి మెలసి మాట్లాడడం, కూర్చోవడం, తిరగడం, చెరతో సమానం కదా!

**సందర్భము:** 'ఋష్యశృంగుని చరిత్ర' లోని పద్యమిది. రోమపాదుడనే ఒక మహారాజు అంగదేశానికి రాజు. అతను పురోహితులను, బ్రాహ్మణులను అవమానించిన కారణంగా వారు అతనిని విడచి వెళ్ళిపోతారు. వారు విడవడం చేత దేవతలు కూడా విడచి వెళ్ళిపోతారు. అందుకని ఆ దేశంలో వానలు కురవడం లేదు. అపుడా రాజు పశ్చాత్తాపపడి బ్రాహ్మణులను పిల్చి, ఆరాధించి, తరణోపాయం అడుగగా వారు "మహారాజా! ఋష్యశృంగుడనే పేరు గల మహాముని ఉన్నచోట ఎల్లప్పుడు వానలు పడతాయి" అని చెబుతారు. అపుడు ఆ రాజు ప్రౌఢులైన వేశ్యాంగనలను పిలచి ఋష్యశృంగుని వశంచేసుకుని తనరాజ్యానికి తీసుకురమ్మని పంపుతాడు. ఆ సందర్భంగా వ్రాయబడిన ఈ పద్యం నన్నయ గారి సూక్తి సుధానిధిత్వానికి మరో ఉదాహరణ.

**52.** క. ‘కడుకొని కడుదుఃఖములై
నెడ నుచితమె? యాత్మనింద యెయ్యెడల మనం
బెడలక యేకాకృతి నె
ప్పుడు నుండుట సూవె పురుష పురుషార్థ మిలన్.

**తాత్పర్యము:** దుఃఖము వచ్చినప్పుడు తనను తాను నిందించుకోవడం ఉచితమా? కష్టసుఖాలలో మనస్సును ఒకే రీతిగా అదుపులో పెట్టుకోవడం మనుషులకు పురుషార్థం కదా!

**సందర్భము:** ఈ పద్యం అజగరోపాఖ్యానంలోనిది. ఇది నహుషుని వృత్తాంతం. దేవేంద్ర పదవి అధిష్ఠించిన నహుషుడు ఒక సద్బ్రాహ్మణుని అవమానపరచి, శాపాన్ని పొంది ఒక కొండ చిలువగా మారి భూలోకంలో ఉంటున్నాడు. ఒకసారి భీమసేనుని పట్టుకొని తినబోతూ అతనికి తన వృత్తాంతాన్ని చెప్పి దుఃఖిస్తాడు. అప్పుడు భీమసేనుడన్న మాటలివి. సుఖదుఃఖాలను సమానంగా చూడడమే పురుషార్థమని సందేశం యిస్తాడు. ఇది నన్నయగారి ఒక చక్కని సూక్తి.

**53.** ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము తాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరము లంబరపూరితంబు లై.

**అరణ్యపర్వము – చతుర్థాశ్వాసము – 141**

**తాత్పర్యము:** అవిశరత్కాల రాత్రులు. మిక్కిలి ప్రకాశవంతమైన నక్షత్ర మాలికలతో కూడి ఉన్నవి. వికసించిన తెల్ల కలువల సుగంధంతో కూడిన గాలి యొక్క పరిమళాన్ని వహించాయి. అంతటా వెదజల్లబడిన కర్పూర పుపొడివలె ఆకాశాన్ని ఆవరించిన చంద్రుని వెన్నెల వెల్లువలు కలిగి మిక్కిలి సొగసుగా ఉన్నాయి. ఈ శరత్కాలపు వర్ణనతో నన్నయభట్టు కవిత్వం ముగిసింది.

